# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది, అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పెప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

లోకంపోకడ :: డేవిమెన్

మానేతని అనుసరించూ

నా అంతరాత్మ మాటవిన్నా

నిన్న

నేడు

సంజయ్ కాలంలో యువజన కాంగ్రెసు

పాపం ఇవాళ అదే యువజన కాంగ్రెస్

దురాక్రమణ దారుని తరిమేసిరా!

సరే! ఆయుధాల సప్లయి రానివ్వండి

మనం మావో విలువ తగ్గించాం అంతేగాని అతన్ని నిందించ లేదు.


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938—1972]

శుక్రవారం : 5-12-'80

రౌద్రినామ సం. కార్తీక బ. త్రయోదశి

సంపుటము 74 : సంచిక 1.

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 54-60

ఆరు మాసాల చందా రు. 27-30

విడి ప్రతి వెల ఒక రూపాయి

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



నటి స్వప్న

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**



# తలలో ముడుచుకున్నట్టే మీ శరీరాన్ని అలంకరించుకోడానికి రంగు రంగుల పువ్వుల గుత్తులు...

మీ శరీరాన్ని పువ్వులతో అలంకరించుకొనేందుకు ఆకర్షణీయంగా అందాలుచిందే ఇంపైన పువ్వుల విన్యాసంతో క్రొత్తరకం మెట్టూర్ ప్రింటులను ప్రవేశపెడుతున్నారు.

కని విని ఎరుగని అప్పుడే వికసించిన మనోహరమైన పువ్వులవర్ణ విలాసము పసుపుపచ్చని చామంతులు. పరవశపరచే చంపకాలు, సొగసుగా వికసించిన ఎఱ్ఱ గులాబీలు కంటికి ఇంపైన వంగపుఛాయ పువ్వులు.

కనకాంబరాలు, కాశీరత్నాలు ఇంకా ఎన్నెన్నో....

ప్రత్యేకంగా తయారైన మెట్టూర్ ప్రింటులు అలాగే ఉపయోగించవచ్చు లేకపోతే సూపర్ ఫైన్ మెట్టూర్ పాప్లిన్‌లతో జోడించి వాడుకోవచ్చు.

అంతేగాకుండా అలరించే మెట్టూర్ ప్రింటులు మరియు మెట్టూర్ పాప్లినులు ఎంతో మన్నికైనవి.... రంగు చెడనివి మా క్రొత్త క్రొత్త రకాలు ఒక్కసారి వచ్చి చూడండి.

## మెట్టూర్ ప్రింటులు, పాప్లిన్‌లు



మీరు అభిమానించే
మెట్టూర్ మల్లులు, లాంగ్‌క్లాత్
తయారుచేసేవారే వీటిని తయారుచేస్తున్నారు.



OBM 6471 TG

## దీపావళి సంచిక

దీపావళి సంచిక చక్కగా ఉంది. అన్నిటికంటే ముఖ్యంగా ఆకర్షించినవి శంకుగారు కథలకు వేసిన బొమ్మలు. ఒక బొమ్మలో మొత్తం కథనంతటిని పలికించడంలో మరో బాపు జన్మించాడనిపించింది.

పి. రాజనీకాంత్ [పార్వతీపురం]

* * *

14—11—80వ తేదీ దీపావళి సంచిక ఎక్సలెంట్. పత్రికలోని కార్టూన్స్ చాలాబాగున్నాయి. ముఖ్యంగా ముఖ చిత్రంప్రైది కార్టూన్ భలేగా ఉంది. సీరియల్స్ రెండు చదువుతున్నంత సేపు ఎంతో ఉత్సాహంగా ఉంటుంది.

డి. చంద్రశేఖర్ దేశాయ్ [ఆదోని]

## ముఖ చిత్రం

21—11—80 నాటి ఆంధ్రపత్రిక సటి సుమతి ముఖ చిత్రంతో చాల అసహ్యంగా ఉంది. ''ప్రేమతీర్థం'' సీరియల్ ప్రతి వారం చాలా గమ్మత్తు దోరణిలో సాగిపోతోంది. చివరికి ఏ విధంగా ముగుస్తుందో వూహించలేనివిధంగా ఈ సీరియల్‌ను తీర్చిదిద్దారు. మొత్తం చదివేంత వరకూ ఏదీ తెలియదు.

కందిగట్ల ప్రభాకర్ [జనగాం]

* * *

14—11—80 తేదీ నాటి మీ[మా] ఆంధ్ర సచిత్ర వారపత్రిక పైని కార్టూన్ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించింది. ఈ వారం ప్రశ్నావళి, డాక్టరు సలహాలు లేకపోవడం వలన నిరుత్సాహం కల్గినది. వ్యాపార ప్రకటనలను తగ్గించి మంచి మంచి విజ్ఞానదాయకమైన వ్యాసాలను, కవితలను ఎక్కువగా ప్రచురిస్తారని ఆశిస్తున్నాము.

జావీద్, సుదర్శన్, బ్రహ్మేశ్వర్‌రెడ్డి [అలంపూరు]

## కథలు

కథానిక మామ పోరులో చక్కని పదజాలంతో క్లుప్తంగా నేటికి సమాజంలోనున్న [కొందరు] అత్తమామల స్వార్థానికి తమ కొడుకు కోడలు ప్రొద్దువత్తులావెలుగుతూకుటుంబానికివెలుగునిస్తూ హరించుకుపోతున్నారని ఈ నగ్న సత్యాన్ని తెలుసు కొని కూడా అత్తగారికి తొమ్మిదవసారి పురుడు పోయడాన్కి, ఇంటిల్లిపాదికీ చాకిరి చేయటానికి కోడలిని పిలిపించుకొని మాటిపోటీ మాటలతో నిందించడము చక్కగా వ్రాశారు. ముగింపు చదువగానే మాకు తెలియకుండా అశ్రువులు రాలాయి.

శ్రీదేవి శ్యాంబాబు [హైదరాబాద్]

## సీరియల

7.11.80వ తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో క్రొత్తగాప్రారంభమైన సీరియల్ స్పందనమమ్మల్ని మొదట్లోనే బాగా ఆకట్టుకుంది. ఈ వారం కథ అన్నింటిలో నమ్మలేని నిజం కథ చాల బాగుంది.

డి. చంద్రశేఖర్ దేశాయ్ [ఆదోని]




'మువ్వల మురళి' సీరియల్ మమ్మల్ని ఎన్ని రకాల వాదనలలో పెట్టిందో, అన్ని వాదనలను తుడిచేస్తూ, 31.10.80 సంచికలోని సీరియల్ భాగం చదివేటప్పటికి ఆశ్చర్యం కల్గి, మా వాదనలకు నవ్వుకున్నాం. రోజా, హరితలలో ఎవ్వరో ఒకరు చచ్చిపోయి, రెండవార్ని కృష్ణమూర్తికి చేతిలో చెయ్యి వేయించి కలిపేసి చనిపోతారని వాదించుకొన్నాం. కానీ శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన సంచికలోని భాగం చదివేటప్పటికి రచయిత్రి సంధ్యాదేవి కథని ఎంత బాగా మలుపు తిప్పిందో అని ఆశ్చర్యపోయాము. ఆవిడకి మా ధన్యవాదాలు అర్పిస్తున్నాము.

కె. ఎస్. మూర్తి, తిరుమలరావు, శ్రీమతి చిన్న, మరియు సుబ్రహ్మణ్యం, కె. ఆర్. [జబల్ పూర్]

* * *

అన్నాచెల్లెళ్ళు పెదవులతో, కళ్లతో, మనస్సులతో మాట్లాడుకోవడం, గదిలో తలుపు వేసుకుని, తలకు క్రీము రాయించుకోవడం, అన్నగారితో హోటల్ రూమ్స్‌కి వెళ్లడం, అన్నగారి కొంటె ప్రశ్నలకు చెల్లాయి ముఖం ఎర్రబడటం ఇవన్నీ సంధ్యాదేవి గారి 'మువ్వల మురళి' లోనే సాధ్యమయ్యాయి.

సస్పెన్స్ క్రియేట్ చేయటం కోసం ఇష్టమొచ్చినట్లు వ్రాసేయడం, సస్పెన్స్ విడిపోయాక ముందు వ్రాసినదాన్ని సమర్థించుకోవడానికి ప్రయత్నించడం. వాళ్లిద్దరూ అన్నా చెల్లెళ్లు అని ఎక్కడన్నా మనకు అనిపిస్తుందా? ఆ సంభాషణలు, మాటలు విని ఎవరూ వాళ్లిద్దరూ అన్నా చెల్లెళ్ళు అనుకోరు. హరితకు ముందే చెపితే, అంత మాత్రం ఆ రహస్యాన్ని ఆమె దాచలేదా!?

కె. రామలక్ష్మి (కొవ్వూరు)



## (గత సంచిక తరువాయి)

భరత్ తిరిగి కోలుకోవటానికి నెలరోజులు పట్టింది. బలమైన మందులు, టానిక్కుల కంటే తల్లి ప్రేమ వాడిని మళ్లీ మామూలు మనిషిని చేసింది! ఎప్పుడు వేయి వేసి ముట్టని దీప ఈనాడు భరత్ మీద ఈగ వాలనివ్వకుండా, పువ్వులా పెంచుతోంది. శారదమ్మ ఆనందంగా నిట్టూర్చేది దీప చేతిలో భరత్‌ని చూసినప్పుడు.

దీప ప్రయాణం ఇంకా నెలరోజులేవుంది. తనతో భరత్‌ని తీసుకెళ్ళే నిర్ణయానికి దీప ఎప్పుడో వచ్చింది. అయితే ఆ విషయాన్ని తల్లిదండ్రులకి తెలియపరచాలా, వద్దా, అనే ఆలోచనతో గడిపేస్తోంది.

ఆ రోజు భాస్కర్ కొడుకు పుట్టిన రోజని భాస్కర్ భార్య దీపని కూడా పేరంటం పిలిచి వెళ్ళింది సహజంగా దీప ఇల్లు వదిలి బయటకు వెళ్ళటం మానేసింది. దానికితోడు దీప చరిత్ర ఆ వూళ్లో అప్పటికే చాలమందికి తెలిసిపోయింది.

దీపకి వెళ్ళాలని లేదు. కాని భాస్కర్ భార్య మరీ మరీ రమ్మని చెప్పింది. భాస్కర్, భాస్కర్ భార్య భరత్‌కి జబ్బు చేసినప్పుడు సొంత వాళ్ళలాగా ఆదుకున్నారు. ఆ విషయం దీప మరిచిపోలేదు.

''ఏం పెద్దమ్మా వెళ్ళనా! ఆవిడ మరీ మరీ చెప్పిందిగా.''

''నీ ఇష్టం. వెళితేవెళ్ళు. ఎలాగు వెళ్లిపోతున్నావుగా ఈ దేశంలో పేరంటం ఎలా చేస్తారో చూద్దుగానివి. పసివాడిని నేను చూసుకుంటాలే!'' అని శారదమ్మ కూడా ప్రోత్సహించటంతో దీప పేరంటానికి బయలుదేరింది.

దీప వెళ్ళేసరికి ఆట్టే పేరంటాళ్ళు ఎవరూ రాలేదు. దీపని చూడగానే, చాపలు పరుస్తున్న భాస్కర్ భార్య సాదరంగా ఆహ్వానించి కూర్చోపెట్టి, తను పక్కన కూర్చుంది. చాలా సేపు భరత్ గురించి, ఏవో ప్రశ్నలు అడిగి తెలుసుకొంది. మెల్లగా ఒక్కరొక్కరే రావటంతో దీపని వదిలి లోపలికి వెళ్ళింది. అది పల్లెటూరే అయినా చాలా మందే చేరారు.

తన తల్లి చేసే పేరంటం గుర్తువచ్చింది దీపకి. దసరా వస్తుందనగానే తల్లి ఎక్కడెక్కడో బొమ్మలు పోగుచేసి బొమ్మల కొలువు పెట్టించేది తన చేత! తమకు

సీరియల్

# ప్రేమతీర్థం

—కళ్యాణి సోమరాజ్

తెలుసున్న కుటుంబాలని పిలిచేవాళ్ళు! సాయంకాలం వచ్చినవాళ్ళు డిన్నర్ చేసి, తీరుబడిగా వెళ్ళేవారు. కబుర్లతోను, పిల్లల అల్లర్లతోను ఆరోజు తమ ఇల్లు మహా సందడిగా వుండేది.

"దీపా! పసుపు కుంకుమ తీసుకో!" అంటూ భాస్కర్ భార్య హెచ్చరించటంతో ఆలోచన నుంచి బయటపడి కుంకుమ అందుకోబోయింది.

అంతలో దూరంగా కూర్చున్న కరణంగారి భార్య "అదేమిటమ్మా! ఆ పిల్లకి కుంకుమ ఇస్తున్నావేమిటి? భర్త పోయాడని చెప్పిందిగా వాళ్ళ పెద్దమ్మ!" దీప ఉలిక్కిపడి చేయి తీసేసింది. ఏమంటున్నారు వీళ్ళు, ఎంత ధైర్యం. ఆమె మనసు కోపంతో బుసలు కొట్టింది.

"ఫరవాలేదు తీసుకో. వాళ్ళ మాటల కేంలే" అంటూ తనే కొంచెం కుంకుమ తీసి నుదుటను పెట్టింది.

"పిదపకాలం పిదప బుద్ధులు" అంటూ కరణంగారి భార్య పెదవి విరిచింది.

"నీకు తెలియదా వదినా!" అంటూ మరో ముత్తయిదువ కరణంగారి భార్య చెవిలో ఏదో గుసగుస లాడింది.

"అలాగా! మరి ఆ విషయం చెప్పకోటానికి సిగ్గులేక పోయింది కాబోలు. అయినా ఎలా బరితెగించారో ఈ కాలం వాళ్ళు. దీనికి తోడు ఆ పెళ్ళాం చచ్చిన వాడొకడు. పెళ్ళొద్దు అన్నవాడు మధ్యలో దీని చుట్టు తిరగటం ఎందుకో!"

"మీ రాణి నిస్తాం అన్నారుగా అతనికి! ఏమైంది!"

"మా రాణి నా! మా ఖర్మగాలి వాడికే ఇవ్వాలి! అంతకంటే దాని గొంతు పిసికి చంపటం నయం. అయ్యో! ఇంత పబ్లిగ్గా దీన్ని, వుంచుకున్నవాడికి పెళ్ళెందుకు!..."

దీప కింక ఆ మాటలు వినే ఓపిక నశించింది. హృదయం కోపంతోను, అవమానంతోను బరువెక్కింది. భాస్కరం భార్యతో మటుకు "వెళ్ళొస్తాను" అని చెప్పి బయటకి వచ్చింది.

భాస్కర్ భార్య, దీప గడప దాటా! వెనకనుంచి వచ్చి బుజం పట్టుకొని ఆపి "సారీ, దీపా! ఈ రోజు జరిగిన అవమానం నా మూలంగానే అయింది. నన్ను క్షమించి ఈ విషయం మర్చిపో! మానవత్వం లేని మనుషులు వీళ్ళు. నోటి కెంత తోస్తే అంత వాగెయ్యటం తప్పించి, ఎదుటి మనుషులని అర్థం చేసుకొనేందుకు ప్రయత్నం చేయరు" అంటూ దీపని అనునయించింది.

"ఫరవాలేదు. దానికి మీరేం చేస్తారు. లోపల కెళ్ళండి పేరంటం మధ్యలో వెళ్ళి

**జరిగినకథ—11 :** పెళ్ళి కాకుండనే తల్లి కాబోతున్న కూతురు దీపను పురుడు అయ్యేవరకు తనదగ్గర వుంచుకోమని న్యూయార్క్‌లో ఉంటున్న చెల్లెలు భామనుతి, అక్కయిన శారదమ్మకు ఉత్తరం వ్రాస్తుంది. ఆమె అనుమతితో శారదమ్మ పొలం వ్యవహారాలను చూస్తున్న చంద్రం ఏర్‌పోర్ట్‌కి వెళ్ళి దీపను తీసుకువస్తాడు. దీప వేషధారణను చూసి ఆ పల్లెలోవాళ్ళు ఆశ్చర్యంతో వింతజంతువును చూసినట్లు ప్రవర్తిస్తుంటారు. చంద్రం ప్రతినెలా దీపను తీసుకెళ్ళి విజయవాడలోని లేడీడాక్టర్‌కు చూపించి తీసుకు వస్తుంటాడు. తనకు పుట్టబోయేబిడ్డను ఏ అనాధాశ్రమంలోనో జేర్పించి, తన తల్లిదండ్రుల వద్దకు వెళ్ళిపోతానని చెప్పిన దీపనుచూసి నివ్వెరపోతాడు చంద్రం. అలా ఆమె వదలివెళ్ళిపోయే పక్షంలో, పుట్టబోయే ఆ బిడ్డను తాను పెంచుకుంటానని చంద్రం శారదమ్మతో చెప్తాడు. దీప బలవంతంమీద, తనకూ సీతకు గల పూర్వ వృత్తాంతాన్ని ఆమెకు చెప్తుంటాడు చంద్రం. చదువు ముగించుకొని ఇంటికి వస్తున్న చంద్రానికి రైల్వేస్టేషన్‌లో సీత పరిచయం అవుతుంది. ఆ తరువాత వాళ్ళ పరిచయం దినదినాభివృద్ధి చెందుతుంది. ఓ నాడు చంద్రం తన తల్లిదండ్రులతో సీత అనే పేదపిల్లను ప్రేమిస్తున్నానని, ఆమెనే పెళ్ళి చేసుకొంటానని చెప్పగా వారు నిరాకరిస్తారు. ఎవరి తరఫువారూ అంగీకరించకపోవటంతో, యాదగిరి గుట్టమీద తమకు సన్నిహితులైన కొంతమంది స్నేహితుల సమక్షంలో నిరాడంబరంగా పెళ్ళి చేసుకుంటారు చంద్రం సీతలు. కొంతకాలం తరువాత, చంద్రం అమ్మమ్మ చనిపోతూ అతని పేర వ్రాసిన ఆస్తిపాస్తులు ఉన్న పల్లెటూరు వెళ్ళి కాపురం సాగిస్తుంటారు. పురుడు పోసుకోవటానికి పల్లెటూరిలో వున్న తన పుట్టింటికి వెళ్తుంది సీత. నెలలు నిండకముందే నెప్పులు రావడం, ఆ పల్లెటూరి నుండి బందర్ తీసుకువెళ్తుండగా మార్గ మధ్యలో ఓ ప్రాణంలేని శిశువుని కని ప్రాణంవిడుస్తుంది. ఈ విషాద కథనం అంతావిన్న దీప, తనకు పుట్టబోయే బిడ్డను చంద్రానికి ఇవ్వటానికి అంగీకరించగా అతను తన కృతజ్ఞతను తెల్పుతాడు. దీపకి అబ్బాయి పుట్టాడు. చంద్రానికి డాక్టర్ ఈ సుభవార్తతో పాటు దీపకి మరి ఇక పిల్లలుపుట్టే అవకాశం లేదనిచెప్పగా అతను కృంగిపోతాడు. అమ్మ వ్రాసిన ఉత్తరం చూసి, వెంటనే వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుని చంద్రాన్ని వీడ్కోలు చెప్పమంటుంది దీప. దీపను తనతోపాటు తను నడుపుతున్న 'బాల విహార్'కు తీసుకు వెళ్తాడు చంద్రం. అక్కడవున్న అనాధలపై ఆమె జాలి చూపగా, 'కళ్ళు మూసుకుని పొగరెక్కి వెధవపన్లు చేసి ఇలా దిక్కులేని వాళ్ళను చేయకపోతే చేసేముందు తెలీదా' అన్న ఆయా మాటలు ఎందుకో తననే సూటిగా అడిగినట్లు బాధ పడుతుంది దీప. దీపకు యిక పిల్లలు పుట్టరన్న నిజాన్ని చంద్రం ఎంత దాచినా, ఓనాడు డాక్టర్ వలన తెలుసుకుని బాధపడుతున్న దీపను ఓదారుస్తాడు చంద్రం.

## ప్రేమ తీర్థం

పోతున్నందుకు నన్నే మీరు క్షమించాలి" అంటూ దీప వడి వడిగా అడుగులు వేసింది.

* * *

చల్లగాలి మృదువుగా వచ్చి దీప చెంపల్ని స్పృశించి పోతోంది ! ఇంతలో గడియారం 'టంగ్ టంగ్'న పది గంటలు కొట్టింది. దీప ఉలిక్కిపడి "అబ్బ పదిగంటలైందా ! అంటే తను గంటనుంచి 'వాస్తోంది' ఈ ఉత్తరం" అనుకొని కొద్దిగా ఆశ్చర్యపడింది. శారదమ్మ, భరత్ ప్రశాంతంగా నిద్రపోతు న్నారు. ఉండిండి బాబు నిద్రలో నవ్వు తున్నాడు. ఆ నవ్వు చూసి దీప మురిసిపోతూ "వీడికెంత అందమైన కలలొస్తున్నాయో! అలా నిద్రలో కూడ చిరునవ్వులు చిలికిస్తు న్నాడు" అనుకొంది.

వ్రాసిన పేపరు ఒక్కసారి చేతిలోకి తీసు కొని పైనుంచి చదవ నారంభించింది.

ప్రియమైన అమ్మకు !

ఇంకా నా ప్రయాణం నెలరోజుల్లోకి వచ్చింది. మీ దగ్గర కొస్తున్నందుకు నాకెంత ఆనందంగా వుందో, అంత భయంగా కూడ వుంది. ఎందుకంటే నేనిప్పుడు పూర్వం దీపను కాదు. శారీరకంగా, మాన సికంగా చాలా మారాను. నీ ప్రపంచంలో నేను ప్రేమను, తీయదనాన్నే చవి చూస్తూ అమాయకంగా పెరిగాను. ఇప్పుడు ఈ బయట ప్రపంచంలో కాలు మోపాక ప్రేమ కాకుండా, ద్వేషాలు, కోపాలు, ఎగతాళులు అన్నీ వున్నాయని గ్రహించాను. నీ కూతురు ఏ చిన్న మాట పడకూడదని చాలా దూరం పంపావు మమ్మీ! బట్ నాకా చెడ్డ పేరు పోదు, పోలేదు. నా వెనకే వచ్చింది. అందరూ నా మోహానే 'గిల్టీ' అంటుంటే సిగ్గుతో, రోషంతో తల వాల్చాల్సివస్తోంది! నే పెరిగిన సమాజం వేరు. ఇక్కడ నేను చూస్తున్న సమాజం వేరు. నేను విటూ కాకుండా పోయానే, అనే బెంగ. ఆ విషయాలన్నీ వదిలెయ్యి. నేను చెప్పబోయేది ఓపిగ్గా విను. నీకు మొదట నేను చేసే పని నచ్చక పోవచ్చు. కాని ఇంతకంటే దారి లేదు. నువ్వు తల్లిలా కాకుండా, పై మనిషిగా నా గురించి ఆలోచిస్తే నేను చేసేది తప్పనిపించదు.

బాబుని ఇష్టం వున్నా లేకపోయినా

కన్నాను. తల్లినయ్యాను. కాని నా అదృష్టం అక్కడ కూడా బాగా లేదు. మనం అను కొన్నది ఒకటి, భగవంతుడు తిప్పిన మలుపు మరొకటి. అప్పుడు నాకుజరిగిన ఆపరేషన్‌లో నేనిక తల్లినయ్యే అవకాశాన్ని పూర్తిగా కోల్పోయాను. ఇప్పుడు చెప్పమ్మా, ఇద్దరి పిల్లల తల్లిలా చెప్పు. నేను ఏం చేయాలి. నా స్వార్థం కోసం, నా అందమైన భవిష్యత్ కోసం నా బాబుని అనాథాశ్రమం పాలు చెయ్యాలా! అప్పుడైనా నేనిక తల్లిని అయ్యే యోగ్యతే లేదే! అది తెలుసుకొన్నాక నన్ను ఎవ్వరైనా పెళ్ళాడుతారా! చెప్పు. ఏం చేయను. నువ్వు నా దగ్గరుంటే ఎలా నడి పించేదానివో నాకు తెలియదు. కాని నాకై నేను ఆలోచించి చేసుకున్న నిర్ణయాలు రెండు మొదటిది బాబుని నా దగ్గరే ఉంచు కోవటం. రెండవది...''

తలుపు మీద ఎవరో 'ధన-ధన' బాద టంతో ఉత్తరం ముడిచి టేబుల్‌మీద పెట్టి బయటకొచ్చి వీధి తలుపు తీసింది.

చెమటలు క్రక్కుకుంటూ ఖంగారుగా నిలబడ్డాడు భాస్కర్!

''దీపా! చంద్రానికి బాగా దెబ్బలు తగిలాయి. కుట్లు అవీ వేయించి ఇంటికి తీసు కొచ్చాం. ఈ రాత్రికి కాస్త చంద్రం దగ్గర మీరెవరైనా వుండగలరా!'' అతను ఆయాస పడుతూనే చెప్పాడు.

దీప ఒక్క క్షణం తేరుకోలేక పోయింది.

''ఏమిటి! ఏమైంది!'' ఇంతలో శారదమ్మ ఖంగారుగా లేచి వచ్చింది.

''ఏం లేదమ్మా! సాయంకాలం మన చంద్రం విజయవాడ నుంచి బస్సు దిగి వస్తుంటే, చాటునుంచి నలుగురు మనుషులు చంద్రాన్ని తీవ్రంగా కొట్టి గాయ పరచారు. అంతలో అటువైపు మన మనుషులు వెళితే, వాళ్ళను చూసి పారిపోయారట. అటునుంచి, అటే వాళ్ళు చంద్రాన్ని హాస్పిటల్లో చేర్చి నాకు కబురు చేసారు. నేను ఇంటికి వెళతా నని చంద్రం మొండికేస్తే, డాక్టరుగారు ఆయన కారు ఇచ్చి పంపించారు. కొంచెం ఈ రాత్రికి ఎవరైనా మీరు కాస్త...''

''దానికేం భాగ్యం. అయినా ఎవరికలా చేతులు వచ్చాయి. బంగారంలాంటి వాడే! ఒకళ్ళకు చెడు తలంపు కూడ చేయడే...'' శారదమ్మ వాపోయింది.

''కరణంగారి మనుషులని ఆ చూసిన వాళ్ళు అంటున్నారు. కేసు పెడదాం అంటుంటే చంద్రం ఒప్పుకోవటంలేదు'' దీప లోపలికి వెళ్ళి పాలు కలిపి ఫ్లాస్క్‌లో పోసి వచ్చింది! ''పెద్దమ్మా బాబుకి పాలు ఫ్లాస్క్‌లో వున్నాయి, ఒకవేళ ఏడిస్తే పట్టు. నేను వెళుతున్నాను.''

''దీపా! రాత్రిపూట నువ్వెందుకులే. నేను వెళతాను.'' శారదమ్మ లోకం ఏమంటుందో అని భయం.



''పరవాలేదు పెద్దమ్మా! వాకే వూరు వాళ్ళు ఏమన్నా భయంలేదు. చంద్రానికి ఆపదలో ఏమాత్రం సాయపడకపోతే మనం మనుషులం కాదు. పద భాస్కర్!'' ఆ చీకట్లో భాస్కర్ వెంట నడిచింది దీప.

* * *

ఆ రోజు సాయంకాలమే చంద్రానికి వారం రోజుల నుంచి వస్తున్న జ్వరం విమ్మదిం చింది. దిండు కానుకుని కూర్చుని ఆట బొమ్మలతో ఆడుకుంటున్న బాబు వంక చూస్తూ కూర్చున్నాడు. దీప ఏదో చేస్తున్న ట్లుంది, గిన్నెలచప్పుడు చిన్నగా వినిపిస్తోంది!

తలకు తగిలిన గాయాలు పూర్తిగా మాన లేదు గాని, అవి ఇప్పుడు బాధించటం లేదు. చంద్రానికి ఇలాటి విషయాలు కొత్తే! పల్లె టూరులో పెరగబోబట్టి ఇంత కక్షలు, ఈర్ష్యలు వుంటాయని అతనికి తెలియదు. ఆ రోజు తన పాటికి తను వస్తున్న వాడిని వెనక నుంచి వచ్చి కర్రలతో బాదారు! అంతే తెలుసు తనకు. కరణంగారి మనుషులని, కేసు పెడదామని భాస్కర్ తనని చాలాసార్లు అడిగాడు. కేసుల మూలంగా శిక్షలు పడ వచ్చేమో కాని, కక్షలు తగ్గవు. పాటి గోడ వల్లో తనిప్పుడు తలదూర్చలేదు. తనే ఈ వూరు విడిచి పోతే, చాలా సమస్యలు వుండవు. తన మూలంగా ఈ వూరి ప్రశాంతతకి భంగం కలగదు. ఎలాగు ఒంటరిగా సీత తిరిగిన ఈ ఇంట్లో వుండలేకుండా వున్నాడు. దీప, బాబు కొన్ని రోజులలో వెళ్ళిపోతున్నారు. ఇన్నాళ్ళు వాళ్ళ సందడిలో నిద్రపోతున్న తన మనస్సు మేలుకొంది. మళ్ళీ ఒంటరితనమే.

''ముందీ టాబ్‌లేట్ వేసుకొని కాఫీ

## ప్రేమతీర్థం

తాగండి" దీప రావటంతో చంద్రం ఆలోచనలకు భంగం కలిగింది.

"భరత్ ఆరోగ్యం బాగానే వుందికదూ!" కాఫీ అందుకున్నాడు.

"ఆఁ. అల్లరి ప్రారంభించాడు అప్పుడే."

చంద్రం హాయిగా నవ్వాడు.

"పిల్లలు అల్లరి చేయకపోతే అందమే వుండదు."

"అది సరే. మీరేమిటి పొలం, ఇల్లు బేరం పెట్టారట."

"భాస్కర్ చెప్పాడా !"

"ఔను, అదేం. డబ్బు కావాల్సి వచ్చిందా !"

"నాకు ఈ వూరు వదిలి వెళ్ళిపోవాలని పిస్తోంది !"

"ఒక్కసారి ఏదో ఇలా జరిగింది అని వూరి విడిచి పారిపోతారా ?" దీప చంద్రం చేతినుండి అతను తాగేసిన కాఫీ కప్పు అందుకొంది.

"అదేంకాదు దీపా! ఏందు కనవసరమైన గొడవలు"

"పోనీ కేసు పెట్టాల్సింది."

"పోన్లేద్దు. ఆ గొడవల్లో తలదూరిస్తే బయట పడడం కష్టం."

"ఎంత ప్రమాదం తప్పింది. ఎవరో మనుషులు అలికిడి కాబట్టి పారిపోయారు. లేకపోతే..."

"ప్రాణం తీసే వాళ్ళేమో! నా కోసం ఏడ్చేవాళ్ళు ఎవరులే !" చంద్రం తేలిగ్గా నవ్వేసాడు.

"అలా అనకు చంద్రం ! ఒక మంచి మనిషి కోసం వూరంతా ఏడుస్తుంది."

"చాలా పెద్ద మాటలే మాట్లాడుతున్నావు. అంత గొప్పవాడిని కాదు. అదిసరే, ఇన్నిరోజుల నుంచి ఓపిగ్గా సేవ చేస్తున్నావు. నేను మళ్ళీ మామూలు మనిషి నయ్యానంటే నీ చలవే. చెప్పు. ఏమిచ్చి ఋణం తీర్చుకోమంటావు."

"నాకు నువ్వు చేసిన దానికంటే ఎక్కువే చేసానా?"

"అందుకు వడ్డీతో సహా తీర్చేసుకొన్నావన్నమాట."

"మరే, వెళ్ళిపోతున్నప్పుడు మళ్ళీ ఋణాలు వుండకూడదని."

"మళ్ళీ ఇండియా రావా ?"

"నా కెవరున్నారని ?"

"అదేంమాట. పెద్దమ్మ లేరా!"

"అంతేనా ! ఇంకెవ్వరు లేరా !"

చంద్రం మాట్లాడలేదు.

"నువ్వు బాబుని తీసుకెళుతున్నందుకు ఆనందంగా వున్నా వాడిని పోగొట్టుకుంటున్నానే అన్న బాధ లేకపోలేదు. నా ఒంటరి జీవితానికి ఆలంబనం అవుతాడనుకొన్నాను. పోన్లే తల్లి ప్రేమ దక్కింది." చంద్రం భరత్ వంక ప్రీతిగా చూస్తూ అన్నాడు.

"లేదు చంద్రా! వాడు ఎక్కడికి వెళ్ళటం లేదు. ఇక్కడే వుంటున్నాడు." ఆ మాటలకు చంద్రం చివ్వున తలెత్తి దీప వంక చూసాడు.

"అదేమిటి మళ్ళీ మొదటికి వచ్చావా!"

"లేదు, చివరకే వచ్చాను. బాబుతోపాటు నన్నూ వుంచుకో!"

"ఆ మాటే వూళ్ళో వాళ్ళు అంటున్నారు." చంద్రం ఎగతాళిగా అన్నాడు.

"చంద్రం! నేనీ విషయం సీరియస్‌గానే చెబుతున్నాను. నన్ను పెళ్ళిచేసుకోగలవా !"

"దీపా! అర్థం కావటంలేదు నీ ధోరణి. బాబుని తీసుకెళితే— నీకిక పెళ్ళి కాదని అంటున్నావా! లేక వీళ్ళు ఏదో వాగుతున్నారని ఈ నిర్ణయానికి వచ్చావా !"

"అదేం లేదు. ఏమూలో అంతరాంతరాల్లో ఈ కోరిక అణిగి వుంది. నువ్వు చెప్పినట్లు నన్ను పెళ్ళి చేసుకోవాలంటే చాలా గొప్ప మనసున్నవాడే కావాలి. నిన్ను మించిన గొప్పవాళ్ళు వుంటే వుండవచ్చునేమో! కానీ నీమీద నాకు అభిమానం ఏర్పడింది. నీది అమృతం లాంటి మనసు. సీతకోసం నువ్వన్నీ త్యాగం చేసి వచ్చావని తెలిసినప్పుడే నామనసు

## కసి ?

ఈ పిడికిలి —
ఇంత 'కసి'తో బిగుస్తున్నదెందుకు ?
వాడు —
కారెక్కి ఊరేగుతున్నందుక్కాదు,
నా —
కళ్ళలో దుమ్ముకొట్టినందుకు !

— కస్తూరి వేణుగోపాల్



## అనారోగ్యాలు అభాగ్యాలు

మీకు విశాలమైన ఛాతీ, దృఢమైన శరీరం, మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే. . . జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.

కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశేషమైన మూలికలు చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు. స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామంఅవసరంలేదు. ఒకవేళ ఇంతకుముందు అలవాటు వున్నట్లయితే కొనసాగించవచ్చు.) వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **20/-**) ★ సెక్‌బాయిల్ మరియు సెల్ఫీ పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు) ★ స్కిన్ లిక్విడ్ : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా నుంచును. వెల : రు. **20-00.** క్రిందిచోట్లయందు లభించగలవు :

వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎస్. వి. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్, క్లాక్ టవర్ ఎదుట, విష్ణుమెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి : టి. ఎస్. ఎన్. మూర్తి. పార్వతీపురం : పద్మినీ మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలచెట్టు స్ట్రీట్. విజయనగరం : భట్టుల లింగప్రసాదరావ్ మైన్‌రోడ్డు. విశాఖపట్నం : నీలం & కం., ఎ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.ఎ. శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్‌సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు. అనకాపల్లి : కాసుమంచి అప్పలరాజు. మదనపల్లె : హయగ్రీవ షాప్, 10/75 నెహ్రూస్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్‌సూర్య నివాస్— 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికింద్రాబాద్ : జ్యోతిమెడికల్‌హాల్ 28. ఎమ్. జి. రోడ్డు, డి. జె. పరేక్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. జామ్మా మసీదు, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద అలయం. రేపల్లె : రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మామిడివారిస్ట్రీట్, నోవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : సుమిశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తరిగొండ మెడికల్స్, 247—బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమనాథశాస్త్రి, మునిసిపల్‌కాలని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్‌రోడ్డు. అనంతపురం : కో—ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిడ్., రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామల మెడికల్ స్టోర్స్, మైన్‌బజార్. హిందూపురం : కె. ఆర్. భాస్కరయ్య & సన్స్, మైన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మైన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. పి. కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్, కొత్తగూడెం : నరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ వంజాండేశ్వర మెడికల్‌స్టోర్స్, మైన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం : బేడ వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మైన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందుపురం పోస్ట్. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 బాస్టియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజాశెట్టి & సన్స్, మైన్ బజార్. పామిడి : ఎస్. పి. చిన్నప్పశెట్టి. కడప : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మనిరావ్‌స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. అన్ని మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

**అధికృత విక్రయందార్లు : మెస్సర్స్ : బాలాజి కెమికల్ వర్క్స్,** ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాదు—37, ఫోన్ : 269490.

పై పేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5—00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన్‌టోన్ ప్రోడక్ట్స్,** పోస్టుబాక్స్ నెం. 880, 17/1, క్రెంబిడ్జి రోడ్డు, అలుసూరు, బెంగుళూరు-*560 008.*

# ప్రేమ తీర్థం

నీకు అంజలి ఘటించింది. పోయిన భార్య కోసం విలపిస్తుంటే ఎంత ప్రేమమూర్తివో అర్థం అయింది. అనాథులని చేరదీయటం చూశాక, నువ్వెంత ఉదార హృదయుడవో అన్పించింది. నన్ను నీదాన్ని చేసుకో! నీ గుండె నిండా తొణికిసలాడే 'ప్రేమ మధువు' నాకే సొంతం చేయమని నే నడగను. చారెడు 'ప్రేమతీర్థం' చాలు నా దాహం తీరటానికి. నాకు నువ్వు కావాలి. ముఖ్యంగా నీలాంటి ప్రేమించి, అభిమానించే భర్త కావాలి. చెప్పు చంద్రా!" దీప ఆవేశంగా అంటుంటే చంద్రం చప్పట్లు కొట్టాడు.

"భేష్! చాలా బాగా దంచావ్ ఉపన్యాసం. నీవే వ్రాసుకొన్నావా? ఇంకెవరైనా వ్రాసారా!"

దీప ఒక్కసారి అవమానంతో, రోషంగా చూసింది. "అంటే! నేనిదంతా సరదాకి చెప్పాననుకుంటున్నావా ?"

"దీపా! ఇలా కూర్చో ముందు" అంటూ దీప చేయి సున్నితంగా పట్టుకొని, తన ప్రక్కన కూర్చో పెట్టుకున్నాడు.

"ఇప్పుడు చెప్పు దీపా. నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా ?"

దీప ఔనన్నట్లు తలూపింది.

"పెళ్ళంటే ఇంత త్వరగా చేసుకునే నిర్ణయం కాదు. ప్రయాణం దగ్గరకొచ్చాకా, ఎందుకిలాంటి అభిప్రాయానికొచ్చావు. అమ్మగారు, నాన్నగారు నువ్వు చేయబోయే పని విని హర్షిస్తారనుకున్నావా! అప్పుడు కాదు, నీ విషయం తెలుసుకొని, ఇప్పుడు బాధపడతారు. వాళ్ళు నీ భవిష్యత్‌ని ఎంతో అందంగా తీర్చిదిద్దాలనుకొని ఆశతో వుండి వుంటారు. నువ్వు ఇలా రెండో పెళ్ళి వాడిని..."

"అక్కర్లేదు చంద్రా! నాకే నచ్చచెప్పటా లెందుకు. ఎవరికో పుట్టిన బాబుని కొడుకుగా స్వీకరించటానికి సిద్ధపడ్డావు. కాని... నన్ను మాత్రం నువ్వు భార్యగా చూడలేవు. నాకు తెలుసు. నువ్వు కూడ ఈ వూరివాళ్ళ లాగా హేళన, ఎగతాళి చేయకపోయినా నీ మనసులో వుంది అంతే! అందుకే నేనంటే చిన్నచూపు. నేను నీ కుక్కాడా చెడిపోయిన దాన్నే..."

"దీపా" చటుక్కున దీపను రెండు చేతుల్లో బంధించి హృదయానికి హత్తుకున్నాడు.

5-12-1980 శుక్రవారం మొదలు
11-12-1980 గురువారం వరకు

# వారఫలం

మేషం:—'గ్రహస్థితి అనుకూల ప్రదం'అను ంలో ఆక్షేపణలేదు. ఉద్యోగవృత్తులు, వ్యాపారం ాలమందికి అనుకూలప్రదం. భారీ వ్యాపారం ేసే వారికి ఈ వారంలో ఆదాయాభివృద్ధి కలదు. స్త్రీలకు శుభ పుణ్యకార్యాలు జరుగుట, ధనా ాయం సంభవనుగుట వారఫలం.

వృషభం:—మీ శక్తి సామర్థ్యాలకు పరీక్షా ుమయం. వ్యాపారంలో బాహాటంగా ప్రయత్నిం ుటమేలు. లాభదాయకమని చెప్పవీలున్నది. అధి ారులవలన గొడవరాకుండా భారీ వ్యాపారస్తులు ూచుకోవాలి. అధికానంద ప్రదాయకమైన ారం. సదవకాశం ఏదో మీకు సంభవింపనున్నది. స్త్రీలకు : అన్ని రంగాలలో అభివృద్ధి చెప్పవీలగు ున్నది.

మిథునం:—మీరు ఎవరిని నమ్మిరో, వారి ుూలాననే ఇబ్బంది కలుగనున్నది. మోసకృత్యా ికి లొంగిపోగల పరిస్థితి కూడగలదు. ఆరోగ్య ోపం కూడా కనిపించనున్నది. ద్రవ్యాదాయం ఏదో మార్గాన స్వల్పంగా లభించే మార్గమున్నది. స్త్రీలకు : పుణ్యకార్యాలు ఫలించటం, ఉద్యోగంలో పై అంతస్తుకు పోయే మార్గమున్నది.

కర్కాటకం:—భూములవలన, మీ స్వాధీనంలో గల యిండ్లమూలాన, ఆస్తిపాస్తులవలన, తోటల వలన లాభించేవారం. చాలమంది విషయంలో, రచనా వ్యాసంగం ఫలదాయకం. ఆశించిన వార్త లందటం ఒక ప్రత్యేక ఆకర్షణ. కుటుంబానందానికి లోటులేదు. స్త్రీలకు : ముఖ్యంగా కళారంగంతో పరిచయం గలవారికి లాభదాయకమైన వారం.

సింహం:—మీ ఉద్యోగ విషయంగా సంకట పరిస్థితు లేర్పడగలవు. ప్రభుత్వం వలననో, యాజ మాన్యం మూలముననో బాధాకరంగా ఉండే సూచనగలదు. ఉద్యోగంలో అప్రమత్తతతో ఉండ టం ఎంతైనా న్యాయం. స్త్రీలకు : కళా రం గంలో, రచనా విధానంలో, పుణ్యకార్యాలోచనలో శుభమైన వారమే.

కన్య:— ఒక విషయంలో ముందుకు పోవటం, వేరొక విధంగా వెనుకకు తగ్గుట వారలక్షణం. ఏమంత ప్రోత్సాహకరంగా ఉండేవారంగాదు. వ్యాపా రం లాభించే మార్గంలేదు. తరచు తగాదాలుండే సూచనగలదు. స్త్రీలకు : హాయి, ప్రశాంతి, ఆదా యం,ఆశించినవ్యవహారాలలో అనుకూలత సంభవం.

తుల:—బాధాకరంగా ఉండేవారమే. ఆదాయం లేకపోగా, ధనం పోగొట్టుకొనటం కూడా జరుగు తుంది. దానికితోడు దొంగతనం కూడా జరిగే మార్గంగలదు. అపనిందలు నెత్తికెక్కే మార్గం కూడా లేకపోలేదు. స్త్రీలకు : ధనాదాయం, అధి కంగా భిన్నమార్గాలలో లాభం కనిపించగలవారం.

వృశ్చికం—మీ ఆలోచనలు ఫలవంతం కాగలవు. పెద్దల అనుగ్రహం, మిత్రసహాయం, బంధు మూలంగా ఆదరణ, అభిమానం, స్వల్పంగా ధనా దాయం సంభవించగలవారం. కొన్ని నెలలుగా లేని ప్రశాంతి, సుఖం, ఆనందం సంభవించినదనిపించే వారం. స్త్రీలకు : చాలమందికి, అధిక విద్యార్జనకు అవకాశం, క్రీడావనిలో చొరవ లభించేవారం.

ధనుస్సు:— వృత్తిలోగాని, ఉద్యోగంలోగాని, వ్యాపారంలోగాని, ఏదోవిధంగా ఆదాయమున్నవారం. చాలమందికి అప్రయత్న ధనలబ్ధి గలవారం. పోయిన వస్తువులు దొరికే మార్గ మున్నది. చాల మందికి ప్రయాణ సూచనగలదు. జరిగితే లాభదాయకమే. స్త్రీలకు : ఆటపాటల్లో అవకాశాలు, వృత్తిలో ప్రకాశం సంభవించేవారం.

మకరం:—ఆరోగ్యలోపంలేదు. పలు విధాలుగా అవకాశాలు సంభవించగలవారం. అధిక విద్యకు, విదేశయానానికి ప్రయత్నించే వారికి, ఈ వారా న్నుండి అనుకూల వారంగా చెప్పవచ్చు. ధనలబ్ధి గలవారం. వ్యాపారం బాగాసాగి పోతుంది. స్త్రీలకు : వారమంతా ఆనంద దాయకంగా, అభి వృద్ధి దాయకంగా ఉండగలదు.

కుంభం:—మీ ఆలోచనలు ఫలింపనున్నవి. మీ వ్యవహారాలు ఒక రేవునకు రాగలవు. వ్యాపారం బాగా సాగిపోతుంది. చిత్రరంగ వ్యాపారమయితే అధిక లాభదాయకం. ప్రతి విషయంలో శ్రద్ధా సక్తులు చూపి, అనుకూలత సాధించాలి. స్త్రీలకు: శుభకార్యాచరణ, కుటుంబానందం, సంతాన మూల ముగా ఉత్సాహం సంభవించేవారం.

మీనం:—ప్రతి విషయంలో మీకు చొరవ ఏర్పడుతుంది. మిశ్రమ ఫలదాయకమైనవారంగా చెప్పదగిన వారం. సర్వవిధాల ఉత్సాహంవంతమైన కాలం. కొన్నివిషయాలలో ఆందోళనకరంగా ఉండ గలదు. కఠోరంగా సంభాషించుట మాను కోవాలి. స్త్రీలకు : ఆలోచనలు ఫలించటం, సర్వా భీష్ట సిద్ధిగల వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

"నే నెప్పుడు అలా చూడలేదు. నిజం దీపా ! నువ్వు నా కంటికి అమాయకమైన పసిపిల్లలానే కన్పిస్తావు. నేను అన్నివిధాలా నిన్ను సుఖపెట్టగలనా అనే నా ఆవేదన. నిన్ను అభిమానించాను కాని కామించ లేదు. నిన్ను ప్రేమించాను, పెళ్లి తలంపుతో కాదు. నాకంటే యోగ్యుడు నీకు భర్తగా లభిస్తా డని అభి షించాను."

"నా కెవ్వరూ అక్కర్లేదు." చంద్రం భుజం మీద నుంచే సమాధానం చెప్పింది.

"నువ్వు పరుగులెత్తే వయసులో వున్నావు. నేనో అనుభవాలు గడించి, మానసికంగా ముసలివాడి నయ్యాను."

భుజంమీద చిన్నగా కొరికింది దీప.

'అబ్బా' అన్నాడు చంద్రం.

"ఇంకెప్పుడూ నా దగ్గర ముసలికబుర్లు చెప్పక. జీవితమంతా హాయిగా ఎంజాయ్ చేద్దాం."

"సీత జ్ఞాపకాలతో చచ్చిపోదాం అను కున్నాను."

"సీతని మర్చిపొమ్మని నేనుఅనటంలేదు."

"ఏయ్ దీపా! పెద్దమ్మ వస్తున్నారు లే !" చంద్రం ఖంగారు చూసి దీప పకపక నవ్వేసింది.

"స్టేట్స్‌లో అయితే పట్ట పగలు రోడ్ల మీదే ముద్దులు పెట్టుకుంటారు తెలుసా !"

"ఎలాగా. ఇలా గేనా !"

దీప చంద్రాన్ని వెనక్కితోసి "ఏయ్ ! పెద్దమ్మ అన్నావుగా !"

"భయ పెట్టాలని."

"కాదు బాబు. నిజంగానే వచ్చాను."

శారదమ్మగారిని చూసి ఇద్దరూ ఖంగారు పడ్డారు.

"అమ్మా! దీప ఏదో అంటోంది."

"నాకదంతా తెలుసు బాబు. అది మొన్నే చెప్పింది. మా దీప నీ ఇంటి దీపం అవు తుందని నేను ఆశించలేదు. దాని జీవితం నా కంటి ముందే ఒక గాడిన పడటం ఆనందంగా వుంది." శారదమ్మ చెమర్చిన కళ్ళను కొంగుతో అద్దుకున్నారు.

[అయిపోయింది]

## అంకితం

నిత్య కల్యాణ సుందరుడు, మా వెన్నుకాపు అయిన శ్రీ వేంకటేశ్వరునికి ఈచిన్ని నవలా పుష్పం సమర్పిస్తూ—

- రచయిత్రి

# విశ్వాసం



కప్పగంతుల మల్లికార్జునరావు

'రాముడు, సీత పిచ్చెక్కి కొట్టుకొంటున్నారుట! రావణాసురుణ్ణి పంపి మీ నాన్న పరువు దక్కించండి పాపం!'

తాను కష్టపడి చేసిన బెంగాలీ వంటకాలు సందేశ్, సింగడాలను తింటుండగా, నాన్న దగ్గరి నుంచి వచ్చిన వుత్తరాన్నిస్తూ ఎగతాళిగా అంది సులోచన. మా నాన్న 'పిచ్చి' సులోచనకు ఎగతాళి మేళం. నాకు చిరాకు భాగోతం!

భూములు పుట్టా వున్నా నాన్న గొప్పకోసం వుద్యోగం చేసేడు. తనుఉద్యోగం చేసే రోజుల్లో నమ్మి ఆస్తి వ్యవహారాలను అప్పచెప్తే, వెంకట్రాయుడు మామయ్య మోసం చేసినట్టు తర్వాత గ్రహించాడు.

'వెధవ! నా ఆస్తిని కొంత మిస – ప్రాప్రిమేట్ చేసేడు. మరికొంత అప్రాప్రియేట్ చేసేడు. స్టేట్ స్ట్రిక్ట్ ఆఫీసరుగా పేరు పొందిన వాడిని. వాడు అంతు తేల్చనూ?'

వెంకట్రాయుడు మామయ్య చెవిలో యీ మాటలు దూరటంతో యిరువురి మధ్య యుద్ధం ఆరంభ మయింది.

ఇద్దరూ డబ్బూ, పలుకుబడి వున్నవారాయిరి! అంచేత వారి పోట్లాట మొదట్లో రెండు దున్నపోతుల మధ్య పోట్లాటలా సాగింది. ఆ తర్వాత పోట్లాట స్వరూపం మారింది. ఎవరు గొప్ప అని తేల్చుకోటానికి పోటీలు పడ సాగేరు.

రాయుడు మామ పది రూపాయలు ఖర్చు చేస్తే, నాన్న ఇరవై పైగా అదే పనికి ఖర్చు చేస్తాడు. నాన్న మూట్లు వేస్తాడని రాయుడు మూట్లు కుట్టించాడు. ఇలాగే యింకెన్నో చిత్రాలు!

'రిటైరయ్యాక హాయిగా ప్రశాంతంగా గడపక యీ గొడవలేంటి నాన్నా? నష్టపోయింది తిరిగి రాదుగా?'

'ఒరేయ్. ఇది డబ్బు సమస్య కాదు. ప్రెస్టేజ్ సమస్య. వాడు మోసం చేస్తే నేను ముండమోపిలాగా చేతులు ముడుచుకు కూర్చుంటానా? నెవ్వర్. స్టేట్ ఆఫీసర్ని నేను.'

పోటీ పోను పోను వెర్రి తలలు వేయసాగింది. ఎకరం పొలానికి రాయుడు మామ రెండు బస్తాల అమ్మోనియం వేయించాడని నాన్న అయిదు బస్తాలు వేయించాడు! నాన్న పండక్కి కోడిని కోయిస్తే రాయుడు పొట్టేలును తెగేయించేడు!

ఈ మధ్య పోటీ మరో కొత్త మలుపు తిరిగింది!

రాయుడికి ఎప్పుడు పట్టుకుందో కుక్కల పిచ్చి పట్టుకొంది. తగాదా ఆరంభం నాటికే అతని దగ్గర మూడు వూరకుక్క లుండేవి.

నాన్నకి కుక్కల్ని, పిల్లుల్ని పెంచటమంటే పరమ చిరాకు. అలాంటిది రాయుడి మీద పోటీకి కుక్కల్ని పెంచటం ప్రారంభించాడు.

రాయుడు దగ్గర అప్పుడు రెండు ఆడకుక్కలున్నాయి. అంచేత నాన్న ఎక్కడినుంచో ఒక మగ కుక్కను, ఆడకుక్కను తెప్పించాడు.

'ఒరేయ్ రాముడూ! సీతనే ఏలుకో. ఊళ్లో బజారు ముండల్ని పోషించే భ్రష్టులున్నారు. వాటి జోలికి పోకు. మన ప్రెస్టేజ్ గుర్తుంచుకో.'

రాయుడికి మాటలే కరువా? కుక్కలమీద పెట్టి గొప్పలు చెప్పుకోటం, తిట్టుకోటం యిద్దరికీ గొప్ప హాబీ అయింది.

'ఆ ముండమోపి వెధవ రాయుడుగాడు యీ మధ్య మద్రాసు వెళ్లి కుక్క అనుకొని పందిపిల్లను కొనుక్కొచ్చాడు. స్టీలు చైనునోదాన్ని దాని మెళ్లో కట్టి మరో చివరను తన కాలికి కట్టుకొని వూరంతా వూరేగుతున్నాడు. కలకత్తాలో సింహం లాంటి

కుక్కనోదాన్ని కొని పంపించు. చూడగానే వాడి మొహం మాడిపోవాలి. గుండె ఆగి పోవాలి. డబ్బు ఎంత ఖర్చయినా ఫర్వాలేదు. వూళ్లో నా ప్రెస్టీజ్, స్టేటస్, కొడుకువైన నీ చేతుల్లో పెడుతున్నా.'

మా గ్రామంలో పెద్దల మధ్య పోటీ అలా ఆ వుత్తరంతో, ఎక్కడో కలకత్తాలో బ్యాంకి వుద్యోగం చేసుకొంటున్న నాకు ప్రాణ సంకటంగా పరిణమించింది.

మనుష్యులకే వో పూట తిండి కరువైన దేశంలో, కుక్కలని, పిల్లులని, కుందేళ్లని వెర్రివేషాలు వేయటం బూర్జువా తత్వమని నా నమ్మకం. అంచేత నాకు వాటిని గురించి ఏమీ తెలీదు. తెలుసుకొనే వుత్సాహం, వ్యవధి నాకు లేవు. సాహిత్య వ్యాసంగం, నాటకాలు, నా లోకం నాది.

'ఒరేయ్' తండ్రి వెధవ రాసిన వుత్తరానికి జవాబివ్వాలన్న యింగిత జ్ఞానం లేదా నీకు ? అంతటి గొప్పవాడివై పోయావా ? యీ మధ్య రాయుడిగాడి పంది మన రాముడిని, సీతను కరిచింది. అప్పటి నుంచి అవి పిచ్చెక్కినట్లు కొట్టుకుంటున్నాయి. నా తల తీసేసినట్లయింది. నా అవమానం నీది కాదా ? రావణాసురిడిలా భయంకరంగా వుండే రెండు కుక్కల్ని పంపు. కలకత్తా నుంచి కుక్కలొచ్చేయంటేనే రాయుడు హడలిపోవాలి. యీ వుత్తరానికి జవాబివ్వక పోతే నేనే వస్తున్న' నాన్న వుత్తరం యొక్క సారాంశం.

'కలకత్తా నుంచి బజారు కుక్కను పంపినా మన వూళ్లో తెల్లతోలు వాళ్లను చూసినట్లే చూస్తారు లెండి. ఎలాగో కష్టపడి వో కుక్కను సంపాదించండి పాపం !'

## ఎంతవరకు?

రగిలే హృదయాలలో ఆరని మంచితనం
ఆ మంచితనంలో తెలియని ఆనందం
ఆ ఆనందంలో అంతులేని ఆశ్చర్యం !
ఆ ఆశ్చర్యంలో ఆనంద భాష్పాలు
ఆ ఆనంద భాష్పాల వెనుక దాగిన బాధ
ఆ బాధలో అందని ఆకలి
ఆ ఆకలిలో ఈ కల ఎంతవరకుసాగుతుందో...

- "గుండ్రం"

## విశ్వాసం

నాకు హఠాత్తుగా అమలా ముఖర్జీ గుర్తుకొచ్చింది !

* * *

డాక్టర్ కుమారి రాణీ అమలా ముఖర్జీ గొప్ప అందగత్తె. ధనవంతురాలు. విద్యావంతురాలు. జమీందారీ కుటుంబంలో పుట్టింది. ఎవరైనా యిట్టే పెళ్లి చేసుకొంటారు. కానీ అవివాహితగానే వుండిపోయింది. వయసు పడమరకు తిరుగుతున్నా ఆమె నవనవలాడే టొమేటో పండులా వుంటుంది.

ఆమె ఇంగ్లీషులో కవిత్వం రాస్తుంది. బెంగాలీలో సాహిత్య వుపన్యాసాలిస్తుంది. తెలుగు నాటకాలంటే చచ్చేటంతఅభిమానం.

ఏదో పనిమీద మా బ్యాంకీకి వచ్చినపుడు ఆమెను మొదటిసారిగా చూచాను. కౌగిట్లో వో కుక్క, వెనుక వో కుక్క, వోవర్‌కోట్ పాకెట్‌లో వో బుల్లి కుక్క, మార్చి మార్చి వాటిమీద ముద్దుల్ని కురిపిస్తూనే వుంది. అసూయపడటంలో తప్పేముంది ?

ఆ తర్వాత వోసారి మా నాటక ప్రదర్శనకు ఆహ్వానించాం. నా నటనను పొగిడింది. మరో సందర్భంలో ఏదన్నా బహుమతి యిస్తానని వాగ్దానం చేసింది.

అమలా ముఖర్జీకి 'కుక్కల రాణి' అన్న ముద్దు పేరుంది. ప్రపంచంలోని అనేక కుక్క జాతుల కథలు, వాటి చరిత్ర, వాణ్యత, మనస్తత్వాలు ఆమె స్టడీచేసిందట!

కుక్కల పట్ల ఆమెకంత ప్రేమ ఎందుకో? మనుష్యుల పట్ల కూడా వుందా ?

అవసరం ఆమె దగ్గరికి నన్ను తీసుకెళ్లింది.

పాతకాలపు జమీందారుల భవనం. ముందు భాగం కొంత మోడరనైజ్ చేయబడి వుంది. వెయిటింగ్ హాలులో నిలువెత్తు ఆయిల్ పెయింట్సు నాలుగున్నాయి. మధ్యన కుక్కల చిత్రాలు !

'అమలా, గుడ్‌మార్నింగ్. రాణీ... స్వీట్ నైట్.'

చిలక ! చిలక పలుకుల్ని పలుకుతోంది.

అరగంట వెయిట్ చేసేక మరోగదిలోకి పిలుపు వచ్చింది.

పెద్ద సోఫాలో కూర్చొని వుంది అమల. ఆవుదూడలా వున్న వో కుక్క ఆమె రెండు

కాళ్లమధ్య నలుగుతోంది. బంగారు రంగులో గుండ్రని కళ్లతో, అందంగా వున్న వో చిన్న కుక్క ఆమె మెడ మీద ఎక్కి రొమ్ముల్ని మూతితో రాస్తోంది.

'ఊరుకో ఎడ్వర్డ్. విజిటర్స్ ముందు కూడా చిలిపి పనులేనా ? ఛీ' ప్రియుడితో అన్నట్లు అంది. ఎడ్వర్డ్ వూరుకోలేదు. ఆమె బుగ్గల్ని మూతితో రాసేడు.

'స్వీట్ ఎడ్వర్డ్—డోంట్‌బి సిల్లీ'అంటూ ముద్దు పెట్టుకొని ఎడ్వర్డ్‌ని కిందికి దించేసింది. యీ లోగా దిండు పక్కనున్న రెండు పాకెట్ కుక్కలు ఆమె మీదకి ఎగబాకి రొమ్ములపై కూర్చున్నాయి.

'ఏమిటిలా వచ్చారు ? మళ్లీ నాటకం వేస్తున్నారా ?'

కుక్కల చర్యలని కళ్లప్పగించి చూస్తున్న నేనామె మాటల్తో వులిక్కిపడ్డాను.

'ఎందుకలా వులిక్కిపడ్డారు ? కుక్కల్ని చూస్తే అసూయగా వుంది కదూ ?'

అవును. అసూయ కలగదూ ? ఎంతైనా మగవాడినేగా ? కానీ ఆ విషయం ఆమె ఎలా వూహించింది ?

'యీ కుక్కలకి నాకు ఎన్నో జన్మల బంధం ? లేకపోతే యివి ఎక్కడ వుట్టేయి? ఎక్కడికి చేరేయి ? పూర్వజన్మలో యీ కుక్కల్లో కొన్ని నాకు ప్రియులో, ప్రియురాండ్రో అయివుండాలి. కొన్ని సర్వెంట్స్, మరికొన్ని అప్పుల వాళ్లు, బంధువులు ... యిలా ఏదో బంధం వుండి వుంటుంది — ఏమంటారు ?'

గతజన్మలో యీమెలో ఏదో విధంగా పరిచయమున్న వాళ్లంతా దేశ విదేశాల్లో కుక్కలుగా జన్మించారనేగా ఆమె తాత్పర్యం! యీమె వొక్కతే మానవజన్మ ఎత్తింది. యింకేమనగలను ?

'నా కుక్కల ఫేమ్లీలో అనేక జాతుల కుక్కలున్నాయి. అన్నీ విదేశాలవే. కొన్ని కొన్నని— మరికొన్ని నా విదేశీ ఫ్రెండ్స్ ప్రెజెంట్ చేసినవి. నా ఫేమిలీ చూడటానికి రోజూ విజిటర్స్ వస్తారు. కానీ ఎవరికీ చూపించను. ఎందుకో తెల్సా ? మీలాగా అసూయపడ్తారు. 'జూ'లో జంతువుల్ని ట్రీట్ చేసినట్టు చేయబోతారు. ఐ డోంట్ లైక్ ఆల్‌దట్ నాన్సెన్స్—'

ఆమె ఆగింది. నా గుండె కూడా ఆగింది.

'బట్. ఐ లైక్‌యు యేజ్ ఏన్ ఏక్టర్. మీకు బహుమతి నిస్తానని ప్రామిస్ చేసేను. ఆ బహుమతిగా నా ఫేమిలీని చూపిస్తాను. రిమెంబర్—దిస్ యీజ్ ఎరేర్ ప్రివిలేజ్.'

ఆమె లేచింది. కదిలింది. ఆమెతోపాటు కుక్కలు కూడా కదిలేయి. అకస్మాత్తుగా ఎడ్వర్డ్‌ని చేతిలోకి తీసుకొంది.

'ఇది 'పొమెలేనియన్.' అందులో రతీ మన్మధుల ప్రతి రూపం. లేడీస్ యీ జాతి కుక్కలంటే పడిచస్తారు. శరీరం మీద ఎక్కి తొక్కుతుంటే గొప్ప థ్రిల్! ఇది కరవదు. కాని కరిచే వాటికి సిగ్నల్ యిస్తుంది. మా ఎడ్వర్ కలర్ చూచారా? గోల్డ్ కలర్. రేర్. ఇండియాలోనే లేదు.'

రకరకాల కుక్కలున్న గదులు చూపించింది. అన్నీ ఎయిర్ కండిషన్ గదులే !

అల్సేషియన్, గ్రేట్ డేనియల్, సిడ్నీ సిల్కిడిస్, లేబర్‌డాగ్, కాకర్ స్పేనియన్, బుల్‌డాగ్స్, బాక్సర్, పగ్స్, డేష్యాన్... యింకా ఎన్నో రకాలు. వర్ణించి వర్ణించి చెప్పింది.

తీరా వచ్చేముందు నేను వచ్చిన పనిని చెప్పేను. మా నాన్న కథ కూడా చెప్పేను. అంతా విని ఆమె ఎగతాళిగా నవ్వింది.

'కుక్క నివ్వటమా? అబ్సర్డ్!'

నేను నీరుకారి పోయాను. ప్రాధేయ పూర్వకంగా ఆమె వైపు చూచాను.

'ఓ ! ఐ లైక్ యువర్ ఏక్టింగ్. అంచేత స్పెషల్ కేస్‌గా వో కుక్కని ప్రెజెంట్ చేస్తాను. కానీ మీ నాన్న నా కుక్కల్ని పెంచగలడా? నో. హి కెనాట్. అందుకే ఒక్క కండిషన్—'

భయం భయంగా చూచాను.

'కుక్కను నేనిచ్చినట్లు ఎవ్వరికీ చెప్ప కూడదు. మళ్లీ వెనక్కి తీసుకు రాకూడదు. ఎగ్రీడ్ ?'

* * *

అంజనేయస్వామి సంజీవి పర్వతాన్ని పెళ్లగించుకొచ్చినప్పటంత వుత్సాహంగా పీటర్‌ని యింటికి తెచ్చాను. పీటర్ తోడేల్లా ఉన్నాడు. తెల్లగా అందంగా వున్నాడు. నాన్న చూస్తే ఎంత సంతోషిస్తాడో? తీసుకోవాల్సిన జాగ్రత్తలు సులోచనకు చెప్పేను.

'నా పిల్లల పెంపకంలోనే యిన్ని జాగ్రత్తలు తీసుకోటం లేదు. వెంటనే వెళ్లి మీ నాన్నగారికి యిచ్చిరండి—'

అనుకోకుండా హెడ్ ఆఫీస్ సుంచి డైరెక్టర్లు రావటంతో అది కుదిరింది కాదు. ఆ రాత్రి కుక్కకు ప్రత్యేకంగా పాన్పు అమర్చి, ఫేనువేసి పడుకోబెట్టేను.

తెల్లవార్లూ అరుస్తూనే వుంది పీటర్. తెల్లవారేసరికి సగం వ్రాసిన—నా నవల తాలూకు కాగితాలు, పుస్తకాలు, బాత్ రూమ్‌లో సబ్బు పెట్టెలు, టూత్ బ్రష్‌లు, వంటింట్లో చిన్నచిన్న గిన్నెలు కన్పించలేదు. పీటర్‌గారు వాటిని యిల్లంతా చెల్లాచెదరుగా పారేసేరు. పుస్తకాల్ని, కాగితాల్ని చించి కిటికీలోనుంచి క్రింద పారేసేడు.

'వాతావరణం కొత్తకదూ? కోపం వచ్చి వుంటుంది.'



**వారం రోజులు యిదే గోల. నాన్నకు టెలిగ్రాం యిచ్చాను. నన్నే అర్జంటుగా తీసుకు రమ్మని తిరుగు తాఖీదు.**

కుక్కను చూచి నాన్న గర్వంగా మీసాలు దువ్వేడు. వెండి గొలుసు మెళ్లో వేసి దాన్ని వెంటేసుకొని గ్రామ ప్రదక్షిణం చేసొచ్చాడు. దాని పిచ్చివేషాలు చూచి మురిసిపోయాడు మొదట్లో. అయితే నాలుగు రోజుల్లో మొహం మొత్తినట్లుంది, ఊర కుక్కలా నా మీదికి లేచాడు.

'కలకత్తా నుంచి తెచ్చినా, లండన్ నుంచి తెచ్చినా కుక్కబుద్ధి ఎక్కడ చస్తుంది. ఇంకా సీమకుక్కలకన్నా వూరి కుక్కలే మెరుగు. ఇంత ఎంగిలన్నం పెడ్తే విశ్వాసంగా పడి వుంటాయి. ఈ సీమ కుక్కలు మాంసం మెక్కి మన నెత్తి నెక్కి సవారీ చేస్తాయి. పైగా దీనికేదో పిచ్చి లాగుంది. నాకొద్దీ ముదనష్టం. తీసికెళ్లి ఆ రాణీగారికే యివ్వు. నేనీసారి కుక్కలేం ఖర్మ—పులుల్నే పెంచుతా.'

వెంకట్రాయుడు మామకు కుక్కను అంటగట్టాలని ప్రయత్నించా.

'మీ నాన్న పులుల్ని పెంచుతాట్టగా ? నేనేనా కుక్కల్ని పెంచేది ? ఆఫ్రికా నుంచి సింహాల్ని తీసుకొచ్చి పెంచుతా. ఏమను కొన్నాడో మీ నాన్న ?'

చచ్చిచెడి కుక్కని తీసుకొని కలకత్తా చేరాను. రాణీ అమలా ముఖర్జీ యింటికి టేక్సీలో తీసుకెళ్లాను.

# విశ్వాసం

నన్ను, నా వెంట నున్న పీటర్‌ను చూచి అమలా ఫైర్ అయింది.

'కండిషన్. ముందే చెప్పాను. కంట్రీ బ్రూట్‌లా మళ్లీ ఏ మొహం పెట్టుకొని వచ్చావ్ ?'

'దీనికి..పిచ్చి...'

'షటప్. ఏ లోపం లేనిదే నీమీద ప్రేమతో ధర్మం చేస్తాననుకొన్నావా? పీటర్‌ని ఇచ్చాను కాని ఎడ్వర్డ్‌ని యివ్వమంటే యిస్తానా ? పిచ్చిదని తెల్సి యిక్కడి కెందుకు తీసు కొచ్చావ్? చంపెయ్యలేక పోయావ్— మీ వూళ్లోనే.'

'చంపెయ్యటమా ?'

'ఏం? కోళ్లను చంపి తినటం లేదూ? పిచ్చికుక్కను చంపడానికి భూతదయ అడ్డం వచ్చిందా? పోనీ ఇప్పుడు నే చెప్తున్నాగా? గార్డెన్‌లోకి తీసికెళ్లి చంపెయ్—'

ఆమె పిస్టల్ నా చేతికిచ్చింది. కుక్క భయంగా, దీనంగా నావైపు చూస్తోంది.

ఊళ్లో నాన్న, రాయుడు పట్టుదలలకు పోయి వూరకుక్కల్లా కొట్టుకొంటున్నారు. ప్రెస్టేజ్ కోసం కుక్కలపైన నక్కలపైన మిథ్యా ప్రేమలు ప్రదర్శిస్తున్నారు.

మనుష్యులపైన ప్రేమ విశ్వాసాలు లేక అమల ఫారిన్ కుక్కలతో భోగాలు చేస్తోంది. స్టేటస్ సింబల్‌గా కుక్కల కుటుంబాన్ని పెంచుతున్నది. అదో హాబీ !

కుక్క విశ్వాసమైన జంతువు. దాన్ని పెంచే మానవుడికి అన్ని విలువల పట్ల విశ్వాసం నశిస్తోంది. స్వార్థం... భోగం... వూపిరి !

"జంతువుల్ని కాని, మనుష్యుల్ని కాని పెంచినా చంపినా మాకే సాధ్యం. మధ్య తరగతి మనిషివి. నీకంత త్రాణ ఎక్కడుంది? ఆ రోజు కుక్కల్ని ఎలా పెంచాలో, ప్రేమిం చాలో చూపేను. ఈ రోజు ఎలా చంపాలో చూపిస్తాను."

అమలా ముఖర్జీ నా చేతిలో నుంచి పిస్టల్‌ని విసురుగా లాక్కొంది.

రక్షించమని వేడుకొంటున్నట్లు కుక్క నా కాళ్లముందు మోకరిల్లింది. యజమాని తత్వం దానికి బాగా తెలుసులాగుంది. పిచ్చె క్కినా మనుష్యులకు, జంతువులకు ప్రాణ భయం, జీవితం పట్ల తీపి సమానమేగా ?

కుక్కను ఆప్యాయంగా చేతిలోకి తీసు కొన్నాను.

'మిస్ అమలా. అందం, సిరిసంపదలు, ఐశ్వర్యం వుండగానే గొప్పవాళ్లు కాలేరు మనుష్యులు. మానవత్వం వుండాలి. మీకు మీ మీద విశ్వాసంలేదు. మనుష్యులమీద విశ్వాసం లేదు. అందుకే సహజసిద్ధమైన కోరికల్ని తీర్చుకోటానికి కుక్కల్ని ఆశ్రయించారు. కుక్కల్ని పెంచటం గొప్ప స్టేటస్ సింబల్‌గా భావించి తృప్తి చెందుతున్నారు. మనుషుల్ని ప్రేమించలేని మీరు కుక్కల్ని ప్రేమించటం పెద్ద ఫార్స్. భూతదయ మీద మీకు వుప న్యాసాలివ్వటం వేస్ట్. వంకర తిరిగిన మన స్తత్వం మీది.'

'స్టాప్. బ్రూట్. మీ అయ్యకివ్వు యీ వుపన్యాసం.'

'ఎవరికిచ్చినా వొకటే. పొగరు పట్టిన వూరకుక్కలు వాళ్లు. మదమెక్కిన సీమ కుక్కవు నువ్వు—'

అనదల్చుకొన్న నాలుగు మాటలు అనేసి వూపుగా వెళ్తున్నాను నేను. ఎద్దంత కుక్క నా చేతుల మధ్య వుంది. పిచ్చెటుపోయిందో కుక్కిన పేనులా కూర్చుంది. ప్రేమగా నా చేతుల్ని నాకుతోంది. దాని కళ్లల్లో విశ్వాసం!

అకస్మాత్తుగా పిస్తోలు పేలిన శబ్దం అయి వెనక్కి తిరిగేను.

పంజరంలో వున్న పెంపుడు చిలక చచ్చి నేలమీద పడివుంది !



(గత సంచిక తరువాయి)

























[ఇంకా ఉంది]




కాని రామానికి మాత్రం అత్తకి పిల్లలుండ కూడ దనిపించేది. పిల్లలు లేకపోవడం వల్లే తమని అనగా రామాన్నీ, శ్రీనునీ, చంపనీ చూడ్డానికి గీతత్త అంత దూరంనించి వస్తుంది. ఆమెకే పిల్లలుంటే మరెందుకు వస్తుంది ? రాదు ! అత్త రెండేళ్లకన్నా ఒకసారి రాకపోతే ఎలా ? ఆమె అనురాగం తనమీద కురియకపోతే ఎలా ? అమ్మ వల్ల దొరకని చనువూ, ఆప్యాయతా అత్తవల్ల దొరుకుతోంది. అత్తే రాకపోతే బతుకు ఎంతో నిస్సారంగా, సరదా లేకుండా, సెలవల్లేని చదువులా ఉండును !

నాన్నా ! అమ్మా !

అమ్మ ఎప్పుడూ ఎందుకో ఒకందుకు గుణుస్తూనే ఉంటుంది. నస ఆమెకి అలవాటయి పోయింది. ప్రపంచంలో తను తప్ప అందరూ సుఖపడిపోతున్నట్టూ, తాను ఒక్కర్తే అన్ని కష్టాలూ, దుఃఖాలూ అనుభవిస్తున్నట్టూ వల్లె వేస్తుంది. దేవుడు ఆమె కోరుకున్న అన్ని సుఖాలూ ఇచ్చినా ఆమెకి అసంతృప్తిగానే ఉంటుందేమో ? ఆమెకి కావల్సింది నిత్యం నసగడం !

దీనికి సాయంగా అమ్మకి వాతరోగం ఉంది. కీళ్లజాయింట్లు పట్టేస్తూ ఉంటాయి — అక్కడ వాపులు — ఎన్నిమందులు నాన్న తెచ్చి వాడినా ఇంకా తగ్గలేదనే అంటుంది — ఆ రోగం పోవడమూ అమ్మకి ఇష్టంలేదు కామోసు! అమ్మే రాజకీయాల్లో చేరి ఉంటే అవతల వాళ్లని మూసు చెరువుల నీళ్లు తాగించును అని నాన్న హాస్యం ఆడతారు. అంత అనర్గళంగా మాట్లాడగలదు విసుర్యనా పూర్వకంగా.

ఒకనాడైనా అమ్మ తనని ప్రేమగా దగ్గరకు తీసుకొని, తలనిమిరి ఒక అభిమానమైన మాట అందా ? ఎప్పుడూ ఆర్డర్లు వెయ్యడమే ! అల్లరి చెయ్యకు ! చదువు ! అల్లరి తిరుగుళ్లు తిరక్కు !

(గత సంచిక తరువాయి)

చెడు సావాసాలు చెయ్యకు ! ఇలా అన్నీ ఆంక్షలే ! తనకి పదేళ్ల వయసు వచ్చేవరకూ, కోపమొస్తే కర్రపట్టుకు కొట్టేది అమ్మ. అందువల్ల రామానికి అమ్మంటే ఒక విధమైన బెదురే ! ప్రేమ కన్న !

ఇంక నాన్న ! ఎప్పుడూ సిగరెట్లు కాలుస్తూ వీధి వరండాలో కూర్చోడం — టయిమవగానే ఆఫీసుకి పోవటం — సాయంత్రం వచ్చేక, మళ్లా వరండాలో కూర్చొని, జాతకాలూ, జ్యోతిష్యం ఆ గుడ్డి సిద్ధాంతిగారితో కాని, శ్రీపాద పంతులుతో కాని చర్చిస్తూ కూర్చోడం —

ఉత్తర కాలామృతం, జాతక ఫలఫలమంజిరిలోని శ్లోకాలూ అనర్గళంగా ఉల్లేఖిస్తూ, ఆ శాస్త్రాల ప్రకారం జాతకుడి భావి ఎలా ఉంటుందో చెప్పేవారు —

"ఒరే రామం ! జాతక ఫలఫలమంజిరి మొదటి భాగం పట్టుకురా !" అంటూ పురమాయిస్తే, రామం గొణుగుతూ వెళ్లి తెచ్చేవాడు.

రెండోసారి వచ్చినప్పుడు ఏలినాటి శని యోగిస్తాడా, కీడు చేస్తాడా ? నీచభంగ రాజయోగం అంటే ఏమిటి ? శుభుడైన రవి, పాప స్థానంలో ఉండి, నీచపడితే యోగిస్తాడా, కీడు చేస్తాడా ? రాహువుకి తన దశలో తనంత తాను మేలుకాని, కీడు కాని చేసే శక్తి ఉందా ? లేక ఏ గ్రహం యొక్క స్థానంలో ఉంటాడో ఆ గ్రహం యొక్క ఫలం ఇస్తాడా ? ఇలా రకరకాల జ్యోతిష్య చర్చలు జరిగేవి.

నాన్న వర్ణించే శ్లోకాలన్నీ రామానికి కంఠస్థం వచ్చేసేయి. అవతలివాళ్లు ఏమన్నా వాదిస్తూ ఉంటే, ఈ శ్లోకాలు వర్ణించి, తాత్పర్యం చెప్పగానే అవతలివాళ్ల నోళ్లు మూతపడేవి —

"ఏమోయి కాశీ ! తీరుబాటేనా ?" అంటూ ఆమడ దూరం నించి కేక పెడుతూ గుడ్డి సిద్ధాంతి వచ్చేవాడు — నాన్న పేరు కాశీపతి... కాని అందరూ కాశీ అని పిలుస్తారు.

గుడ్డి సిద్ధాంతిగారికి పదో ఏటే పాపం దృష్టి పోయింది — దృష్టి పోవడంవల్ల చదువు సాగక, ఏం చెయ్యడమో తెలీక ఉండే పరిస్థితిలో జమీందారు గారి (అప్పటి కింకా సంస్థానాలు ఉండేవి) కాళికా దేవాలయంలో చిన్న పూజారిగా నియమితుడయ్యేడు. గుడ్డి సిద్ధాంతి తండ్రి ఆ దేవాలయంలో పెద్ద పూజారిగా ఉండేవాడు. ఆయన పోయాక ఈయన పెద్ద పూజారయ్యేడు.

ఓ చేతికర్ర సాయంతో, రోడ్డుకి ఒక పక్కని నడుచుకుంటూ మందిరానికి వెళ్లడం అలవాటయి పోయింది — మందిరం అతడి ఇంటినించి నాలుగు ఫర్లాంగుల దూరం —

కావి రంగు పంచ కట్టుకొని, ఒంటిమీద కమీజు లేకుండా, మెడలో రుద్రాక్ష మాలలతో, నుదుట సిందూరం బొట్టుతో రోడ్డంట వెళ్లే అతణ్ని ఊరంతా తెలుసు. ఎవరో ఒకరు చెయ్యి పట్టుక రోడ్డు దాటించేవారు.

"దుర్గమ్మ ఉంది ! ఏ ఆపదా రాకుండా చూసుకుంటుంది !" అనేవాడు — దేవీ ఉపాసన ఉందతనికి.

అతడికి ప్రశ్న శాస్త్రం బాగా వచ్చు. ఇంట్లోని నగా నట్రా పోయినా, ఆవూ, గేదే మందలోంచి తప్పిపోయినా, ప్రయత్నిస్తున్న పని జరుగుతుందా, మానుతుందా అన్న ప్రశ్నలకి జవాబు చెప్పేవాడు — సమయం అడిగి, మనసులోనే గుణించి చెప్పేవాడు. ఆ వస్తువు ఏ దిక్కుగా పోయిందో, దాన్ని తీసుక పోయినవాడు ఎలా ఉంటాడో, ఆ వస్తువ దొరుకు తుందో దొరకదో చెప్పేవాడు. తృణమో, పణమో ఏమిచ్చినా తీసుకొనేవాడు. మూడొంతుల ముప్పాతిక అతను చెప్పింది నిజమయ్యేది. దేవీ ఉపాసనవల్ల అతడికా శక్తి వచ్చిందని అందరూ అంటారు.

నాన్నా, గుడ్డి సిద్ధాంతిగారూ జాతకాల కబుర్లలో కూర్చుంటే కాలాన్నే మరిచిపోతారని రామానికి చిరాకు. ఈ జాతకాలు పరిశీలించడం వల్ల నాన్న పరిస్థితులేమన్నా మెరుగుపడ్డాయా ? శుక్రుడూ, గురుడూ, బుధుడూ ఈ గ్రహాల తరఫున వకాల్తా పుచ్చుకొని నాన్న వాదిస్తూ ఉంటే ఆ దేవతలేమన్నా నాన్నకి సాయపడ్డారా ? ఏమీలేదు! ఎన్నేళ్లయినా నాన్న ఆ గుమాస్తా పనే. ప్రమోషన్ అన్నమాటే లేదు ! తన జీతం కట్టవల్సి వచ్చినప్పడల్లా అప్పులు చేయ్యడమే. తన కొకనాడూ మంచిబట్టలు కొన్న పుణ్యాన పోలేదు !

నిక్కర్లు వేసుకుందుకి సిగ్గువేసి పంట్లాలు కుట్టించమంటే, "కాలేజీలో నువ్వు చేరేక ఎలాగూ తప్పదుకదరా బాబూ ?" అంటారు — ఎప్పుడూ ప్రతి పనికీ నాగా పెట్టడం—ఆ చెయ్యవలసిన పనిని ముందు కాలంలోకి నెట్టేసి ఆ బెడద తప్పించుకోవడం నాన్న నైజం అని గ్రహించేడు రామం. అందుకు పర్యవసానంగా చెడు ఫలితం అనుభవించేది తామని అతడికి అనిపించేది.

ఈ ఊరే వదిలి పై ఊళ్లకే నాన్న బదిలీ మీద వెళ్లి ఉంటే ప్రమోషన్లు రావడమే కాదు, ఈ సరికి తాసిల్దారు అయ్యే అవకాశం ఉండేది. అన్ని డిపార్ట్‌మెంటు పరీక్షలూ పాసయ్యేరు ... ఈ జిల్లాబోర్డు వదిలి వెళ్లనంటారు ... అతడి బ్రహ్మచర్యపు దినాలలో నాన్న మంచి హాకీ ప్లేయరుట ! కలెక్టరు వుడ్ కాక్‌తో కలిసి ఆడేవారు నాన్న. ఆ బ్రిటిష్ కలెక్టరు నాన్నని సబ్ ఇన్‌స్పెక్టర్‌గా ఎంపిక చేసేడట — ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోతూ. కాని హెడ్ గుమాస్తా ఆ ఆర్డర్‌ని తొక్కిపెట్టి మూడు వందలు లంచం అడిగేడుట — ముందు ఆర్డరివ్వండి, జీతం అందేక నెలనెలా మీకు ఇవ్వవల్సింది ఇచ్చుకుంటాను అని నాన్న చెప్పినా విన



**జరిగిన కథ-4 :** చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తున్నాడు. మధ్య తరగతి కుటుంబంలోఉండే చికాకులు, సమస్యలు ఆ ఇంట్లోనూ వున్నాయి. చంప నాన్నమ్మకి ఓపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు ఓపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులుపడ్డారు. చంప మామ అవధానివల్ల నాన్నకి ఏర్పడ్డ చిలుముగొట్టం అలవాటుతో అమ్మా, నాన్నల మధ్య వాదోపవాదాలు చెలరేగేవి. చంప అన్న రామంని కాలేజీలో చేర్పడానికి అమ్మ గాజులు అమ్మక తప్పలేదు. ఖర్చులు పెరగడంతో నాన్న సిగిరెట్లు మానివేయగా చంప బాధ పడుతుంది. గతంలో తన కంపాస్ బాక్స్ దొంగిలించిన అప్పారావ్‌ని తన పుట్టినరోజు అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప. అతను వెళ్ళింతర్వాత అలా దొంగిలించడం అతని తప్పు కాదని ఆ విషయంమీద ఓ లెక్చర్ ఇచ్చాడు నాన్న. గీతత్త అంటే రామానికి ఓ ప్రత్యేకమైన అభిమానం. ఆమెకు అన్నీ వున్నా పిల్లలులేరు. నాన్న చెయ్యి చూసి నీకు ఇద్దరు పిల్లలున్నారని చెప్పగా, ఆమె ముఖం వికసించేది.





ేదుట — తరవాత ఆ సెలక్షను రద్దయింది ! ఆనాడే నాన్న ఎస్. ఐ.గా చేరి ఉంటే ఈ సరికి . ఎస్. పి. అయి ఉండును !

ఇదంతా గత జల సేతు బంధనం ! అన్ని వకాశాలూ, నాన్న చేజేతులా జారవిడుచుకున్నారు. ముందు కాలంలోకి వాటిని నెట్టి — బాధ్యతలని భుజంమ్మీదికి తీసుకొని, ప్రస్తుత కాలంలోని ఈ క్షణంలో వాటిని ఎదుర్కొని, కర్తవ్యాన్ని నెర వేర్చడం నాన్నకి చేతకాని పని.

అందువల్ల, ఈ వెలవెలబోతున్న బతుకులో ఇంటికి గీతత్త వస్తే రామానికి ఆనందం ! ఆమె వెళ్ళిపోతుందంటె విచారం. అత్త వెళ్ళిపోడానికి ముందు రోజున పిండి వంటలు చేసేది అమ్మ. బొబ్బట్లు, సద్ది ... ఆ మర్నాడు ఆమె వెళ్ళి పోతూ ఉండగా కళ్ళ వెంబడి గిర్రున నీరు తిరిగేది రామానికి. ఏడ్చేవాడు ... "వెళ్ళిపోకు ! మరో నెల ఉండు !" అని అర్థించేవాడు !

"ఒరే రామం ! నేను ఇక్కడే ఉండిపోతే ఎలాగరా ? అక్కడ మీ మామయ్యకి ఎవరు వండి పెడతారు ?"

"నేనూ నీతో వచ్చేస్తా అత్తా !" ఆమె చెయ్యి పట్టుకు అభ్యర్థన.

"అలాగే లేరా ! వచ్చి ! కాని మీ నాన్నా, అమ్మా ఒప్పుకోవద్దూ ? పెద్దకొడుకు వాయె ! పెద్ద చదువులు చదివి, పెద్ద ఉద్యోగాలు చేస్తావని వాళ్ళ ఆశ ! బుద్ధిగా చదువుకో !" అంటూ రామం నేతిలో రూపాయుంచేది.

రైల్వే స్టేషను వరకూ వెళ్ళేవాడు. ఏదో విలువైన వస్తువుని పోగొట్టుకుంటున్నట్టుగా భావించేవాడు — పిచ్చివాడిలా దిక్కులు తోచక నిలబడిపోయేవాడు. తన బేలతనం గమనించి, అత్త దగ్గరకు తీసుకొని, "ఎందుకురా రామం ఆ దిగులు? వచ్చేఏడు మళ్ళా వస్తానుగా ?" అంటూ ఓదార్పు మాటలనేది.

అత్త రైలు ఎక్కిపోయేక, రైలు కిటికీ లోంచి కనిపించే ఆమె ముఖం కళ్ళార్పకుండా చూస్తూ, రైలు వెళ్ళిపోతూ ఉంటే, కారుతున్న కన్నీళ్ళగుండా మసక మసగ్గా కనిపించే ఆమెకేసి చెయ్యి ఊపుతూ —

మరు ఏడాది, గీతత్త రాలేదు. దానికి కారణం ఉంది — గీతత్త ఓ రెండేళ్ల పసికూనని పెంపకం తెచ్చుకుంది ! మామయ్య బంధువర్గంలోంచి ఓ లేని కుటుంబం వారికి బరువనిపించగా పెంపకం ఇచ్చేసారు. తన ప్రేమాభిమానాలన్నీ వాడిమీదికి మళ్ళించింది.

ఆ సంగతి తెలిసి, రామానికి చెప్పలేనంత కోపం ముంచుకొచ్చింది. అత్తని మరిచిపోయేందుకు ప్రయత్నించేడు కాని సాధ్యం కాలేదు. ఏళ్ళు మీద పడ్డాయి ... మెట్రిక్ పాసవడం, కాలేజీలో చేరడంతో ఆమె జ్ఞాపకాలు మరుగున పడిపోయాయి.

## 12

శ్రీనుకి, అన్న రామంమ్మీద భరించలేనంత కోపం వచ్చింది.

బాల్ బ్యాడ్మింటన్ ఆట — శ్రీనుకి చిన్న బ్యాట్ ఉంది—పెద్ద బ్యాట్ లేదు. ఆ చిన్న బ్యాట్ పట్టుకొని, "నేనూ ఆడతాను," అంటూ మంకు పట్టు పట్టేడు కోర్టుమధ్య.

"నువ్వు ఆడ్డానికి వీల్లేదు!" అన్నాడు రామం.

"ఎందుకాడ్డానికి వీల్లేదు ?" శ్రీను పట్టు దలగా అడిగేడు.

"నీ బ్యాట్ చిన్నది — అందుకు ఆడ్డానికి వీల్లేదు !"

"అయితే నీ పెద్ద బ్యాట్ నాకియ్యి !"

"పెద్దబ్యాట్ నీకిస్తే మరి నేనో ? నువ్వు మా టీమ్‌లో లేవు !"

శ్రీను కోర్టుమధ్య నిల్చున్నాడు కదలకుండా. రామం వెళ్ళి శ్రీనుని కోర్టునించి బయటకు లాగ బోయేడు. శ్రీను ప్రతిఘటించేడు. ఇద్దరికీ ఒకరి మదొకరికి కోపం, క్షణికోద్రేకం పెరిగిపోయాయి.

ఇద్దరూ ఒకరితో ఒకరు కలపడ్డారు. ఒకరి నొకరు చంపాలన్నంత ద్వేషం మనసులో.

తన బ్యాట్‌తో శ్రీను రామాన్ని కొట్టేడు వీపుమీద. రామం తన పెద్దబ్యాట్‌తో తిరిగి కొట్టడంతో దెబ్బగట్టిగా తగిలింది శ్రీనుకి. శ్రీను విజృంభించేడు. ఇద్దరూ ఒకర్నొకరు పెనవేసుకుని చేతులతో కొట్టుకుంటూ మట్టి నేలమీద దొర్లేరు.

వారి బట్టలు మట్టితో నిండిపోయేయి. ఇద్దరి ఒంటినిండీ చెమట, కళ్ళలో ప్రజ్వరిల్లుతూ అలవి కాని క్రోధం. ఒకర్నొకరు తిట్టుకుంటున్నారు. జుత్తు పీక్కుంటున్నారు. కొట్టుకుంటున్నారు. పక్కన జట్టువాళ్ళు విడిపించడానికి ప్రయత్నించ లేదు.

ఇంతలో అక్కడికి చంపా వచ్చి చూసింది జరుగుతున్నది. ఇద్దరి దగ్గరికి వెళ్ళి అరిచింది ...

"ఒరే రామం! శ్రీనుని వొదుల్తావా, నాన్నని పిల్చేదా ?"

ఇద్దరూ ఆమె మాటలు వినే స్థితిలో లేరు శ్రీను కిందపడి ఉన్నాడు. రామం మీద కూచున్నాడు. రామం, శ్రీను పీక నొక్కుతూ ఉంటే ఆ చేతుల్ని తప్పించుకుంటున్నాడు శ్రీను.

చంపా ఇంటికి పరుగుతీసింది. నాన్న వరండాలో కూర్చున్నారు.

"నాన్నా! రామం, శ్రీనూ కొట్టుకుంటున్నరు! రామం, శ్రీను పీక నొక్కేస్తున్నాడు. వేగం పద నాన్నా!"

ఎప్పుడూ లేంది ఒక్కసారిగా లేచేరు నాన్న. చేతికందిన వెదురు బద్దని పట్టుకుని గబగబా నడిచేరు చంపా వెంట — బ్యాడ్మింటెన్ కోర్టు ఇంటికి వందగజాల దూరాన ఉంది ఖాళీజాగాలో. నాన్నకి అంతకోపం రావడం చంపా ఎప్పుడూ చూడలేదు.

వెదురు కర్రతో ఎడా పెడా కొట్టడం ప్రారంభించేరు నాన్న. "రాస్కెల్స్! చదువూ సంధ్యా లేదు కాని, కొట్లాడుకోడమా? చిన్నవాడన్న జ్ఞానం కూడా లేకుండా వాడిమీద పడి వాడి పీక నొక్కుతావా? వాడు చస్తేనో?"

నాన్న గొంతు వినబడి, వెదురు బెత్తంతో దెబ్బలు పడగానే, రామం శ్రీనుని వదిలి లేచి నిలబడ్డాడు. శ్రీను ఏడవడం ఆరంభించేడు. నాన్న రామాన్ని ఎడా పెడా కొట్టేరు. రామం పారిపోలేదు. కదలకుండా నిల్చున్నాడు. పారిపోయి లాభం ఏముంది? రాత్రన్నా ఇంటికి వెళ్లాలి కదా?

చంపా అడ్డుపడింది ... "చాలు నాన్నా! మరి కొట్టకు!" అంటూ చెయ్యి పట్టుకుంది.

"పదండి వెధవల్లారా ఇంటికి, ఇవాళ మీకు తిండి పెట్టను!"

ఇద్దరూ ఇంటికి నడిచేరు. ఇంటికి వెళ్లేక నాన్న మరో రెండు దెబ్బలు కొట్టేరు రామాన్ని.

కాని ఏడుస్తున్నది శ్రీను. రామం దెబ్బలు తింటున్నా ఏడవటం లేదు!

అమ్మ పరుగున వచ్చి సంగతి కనుక్కుంది.

# స్పందన

నాన్న చెప్పేరు ... "వెధవలకి తిండి ఎక్కువయి, ఒళ్లు కొవ్వి, దొమ్మరి వెధవల్లా రోడ్డుమీద కొట్లాడు కుంటున్నారు!" నాన్న కోపంగా అన్నారు.

వీరి వెంట వచ్చిన కుర్రాళ్లన్నారు ... "శ్రీనుదీ తప్పుందండి! కోర్టు మధ్యనించి కదలకుండా, ఎవరినీ ఆడనివ్వకుండా నిల్చున్నాడు! రామాన్ని బ్యాట్‌తో కొట్టేడు!"

ఆ సాక్ష్యంతో నాన్నకి రామంమ్మీది కోపం తగ్గింది. ఇందులో శ్రీనుగాడి తప్పుకూడా ఉండే ఉంటుందని తోచింది. ఎన్నోసార్లు పెద్దబ్యాట్ కొనమని శ్రీను మారాం చేసినా వాయిదాలేస్తూ వచ్చేడు తను, డబ్బు చాలక.

"సర్లేరా! మీరిద్దరూ ఎక్కడుంటే అక్కడే కొట్లాట! ఇద్దరూ ఆ బట్టలు విప్పి స్నానం చెయ్యండి!" అన్నారు నాన్న.

శ్రీను వెంటనే రంగం నుంచి తప్పుకున్నాడు. అతడి మనసు తేలిక పడింది. ఇవాళ తాను రామిగాడిమీద విజయం సాధించేడు. కావల్సిందే వాడికి! తనని ఎక్కడికీ రానివ్వడు. వాడు ఆడే చోట తనని ఆడనివ్వడు. ఈ ఊరినీ మనుష్యులనీ వాడే కొనేసినట్టుగా అనుకుంటాడు. నాన్నకీ, అమ్మకీ వాడంటేనే ఇష్టం! తనూ ఉన్నాడు కాబట్టి తనమీద ఇష్టం చూపిస్తారు. కాని నిజమైన ప్రేమంతా వాడిమీదే! వాడి ఎక్కువేమిటి? తను తక్కువేమిటి?

అమ్మా, నాన్నల ప్రేమ తనమీద పూర్తిగా కురియకుండా, రామం పెద్ద అడ్డుగోడగా కనిపించేడు శ్రీనుకి. కాని ఎప్పుడన్నా జ్వరం వచ్చినపుడు తనకి అమ్మా, నాన్నా మంచం పక్కనే కూర్చొని అన్ని ఉపచారాలూ, సేవలూ చేస్తారే! ఎంతో బాధ, ఆత్రుత వారి ముఖాలలో. ఎవరన్నా, జ్వరంతో ఉన్న తనని చూడడానికి వచ్చినపుడు అమ్మ కంట తడిపెట్టుకొని ... "వెర్రి నాగన్న! వాడి చదువేమిటో, వాడి సంగతేమిటో తప్పిస్తే, ఎవ్వరి జోలికీపోడు! రెండు రోజులయి జ్వరం పేల్చేస్తోంది — జావ చుక్కయినా గొంతు దిగడంలేదు!" అనే అమ్మ ప్రేమ పూరితమైన మాటలు ఎంతో తృప్తినిచ్చేవి శ్రీనుకి. ఈ జ్వరం తగ్గకుండా ఇలా ఎంత కాలమైనా ఉంటే ఎంత బాగుణ్ను! తన కొచ్చిన రోగం ఏదన్నా స్పెషల్ రోగమై, ఏ మందుకీ లొంగకుండా ఉంటే అమ్మ రోజూ ఏడుస్తుంది — నాన్న బెంగపెట్టుకుంటారు. ఇరుగు పొరుగులు వచ్చి తనమీద ఎంతో సానుభూతి చూపిస్తారు — తను చచ్చిపోతే ఎంత ఏడుస్తారో?! ఈ జ్వరం తగ్గకూడదు దేవుడా!

మనసులో ఎంతగా ప్రార్థించినా జ్వరం తగ్గిపోయేది.

ఒంట్లో నీరసం అంటూ కొన్నాళ్లు అందరి సానుభూతీ సంపాదించేవాడు. తరవాత అంతా మామూలే మరోసారి జ్వరం వచ్చేవరకూ! కాని జ్వరం రావడం, మానడం తన చేతిలో ఎక్కడుంది?

అందువల్ల తనమీద ప్రేమ కురిపించే వ్యక్తులు ఎవరైతే ఉన్నారో వారి చుట్టూ తిరిగేవాడు శ్రీను. ఆ వ్యక్తులలో నాన్నమ్మ ముఖ్యమయిన వ్యక్తి. చిన్నాన్న రెండో వ్యక్తి.

చిన్నాన్న ఉంటున్నది అనకాపల్లి. చేస్తున్న పని తాలూకా ఆఫీసులో క్లర్కు పని. అతడు తెచ్చుకుంటున్న జీతం చాలేదికాదని, పదీ, పాతికా పంపమని ఉత్తరాలు!

చిన్నాన్న సన్నంగా, పొడుగ్గా ఉండేవారు. ఒత్తయిన జుత్తు. సైడ్ క్రాఫింగు రెండువేపులా ఎత్తుగా దువ్వేవారు. కోటేరు వేసినట్టు ముక్కు. అతడికెప్పుడూ రామనామ స్మరణే. తాను ఉంటున్న పరిస్థితినించి మెరుగు పడదామని ఎప్పుడూ ఉండేది కాదు.

నాన్నకీ అతడికీ వయసులో భేదం రెండేళ్లే. కాని చిన్నాన్నే నాన్నకన్న పెద్దగా అగపడేవారు శ్రీనుకి. ఎర్రటి తిలకం నుదుట—పంచ, సైకిలు కట్టు కట్టేవారు — ఫుల్ చేతుల కమీజు—దానిమీద డ్రిల్లుబట్ట కోటు — అదొక్కటే కోటుందా. చిన్నాన్నకి మరి కోట్లు లేవా అన్న అనుమానం వచ్చేది శ్రీనుకి. గళ్లకోటు — ఎంత మాపునన్నా ఓరుస్తుంది. చేతిలో ఎప్పుడూ ఉండేది గొడుగు — కాళ్లకి ముదర గోధుమ రంగు కెట్సు — శీతాకాలమే అయితే, చెవులకి చుట్ట పెట్టుకొని ఒక మఫ్లరు— ఆ మఫ్లరుకి ఎన్నో చిరుగులు — అతని పేరు ఆంజనేయులు.

ఓసారి చిన్నాన్న తమ ఊరు వచ్చి, తిరిగి వెళ్లేటప్పుడు అతడితోబాటు అనకాపల్లి తనని తీసుకువెళ్లడం గుర్తుంది శ్రీనుకి. రామం, శ్రీనూ శెలవలకి ఇక్కడే ఉంటే రోజూ కొట్లాటలు తప్పవని ఆ ఏర్పాటు జరిగింది.

అనకాపల్లిలో గడిపిన ఆ శెలవు రోజులు శ్రీను ఎప్పుడూ మరిచిపోలేదు!

## 13

అనకాపల్లిలో శెలవులకు ఖర్చు చేసుకోమని నాన్న శ్రీనుకి రెండు రూపాయలిచ్చేరు. ఆ రెండు రూపాయలనీ చిల్లరగా మార్చుకున్నాడు. ఓ చిన్న డబ్బాలో వేసుకున్నాడు. కాని ఆ డబ్బులని ఖర్చు పెట్టవల్సిన అవసరం లేకపోయింది శ్రీనుకి.



చిన్నాన్న ఉండే ఇల్లు చిన్నది. అద్దె ఇల్లు. రెండు గదులు. వంట ఇల్లు. వీధి వరండాకి తడికలు కట్టి దానినొక గదికింద వాడుతున్నారు.

కాని ఇంట్లోని సభ్యులు ఎనమండుగురు! నలుగురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. ఇద్దరు మగపిల్లలు శ్రీనుకంటే పెద్ద. తక్కిన వారంతా శ్రీను కన్న చిన్న.

వారంతా శ్రీనంటే ఎంతో ప్రేమాభిమానాలు చూపేరు.

ఆ ఇంట్లో వారి పిల్లల కుండే స్వేచ్ఛ చూడగా శ్రీనుకి మతిపోయినట్లయింది. చిన్నాన్నకీ, పిన్నికీ పిల్లలమీద ఏ మాత్రం యాజమాయిషీ ఉండేది కాదు. ఇంక పిల్లలంతా ఎవరిష్టం వచ్చి నట్టు వాళ్లు ప్రవర్తించేవారు. ఎవరి మిత్ర బృందం వారికుండేది. ఒక్కొక్కప్పుడు అందరూ కలిసే ఆడుకొనేవారు. అన్నదమ్ముల మధ్య ఏనాడూ తగవులు ఉండేవికావు.

తెల్లారేసరికి కాఫీ హొటల్నించి ఇడ్లీలూ, దోసలూ పెద్దబ్బాయి వెళ్లి తీసుకుకొచ్చేసేవాడు. పిన్నమ్మ వాటిని పిల్లలందరికీ పంచేసేది. అవి తినేసి ఆడుకుందుకి అందరూ పోయేవారు. అందరికీ కాఫీలు రెండుసార్లందేవి ఉదయం.

ఆ ఇంట్లో నెలకి పదిశేర్ల పంచదార, నాలుగు పవున్ల కాఫీగుండ. ఏ వెచ్చాలు అయిపోయినా కిరణా కొట్టుకువెళ్లి అరువు పట్టుకురావడం. ఇంక సాయంత్రం ఆఫీసునించి వచ్చేటప్పుడు పకోడీలో, ఉల్లిగారెలో హొటల్నించి తీసుకొచ్చేవారు చిన్నాన్న.

గంట మోగించుకుంటూ ఐసు బండీ రాగానే, పిల్లలంతా ఆ బండి చుట్టూ మూగేవారు.

"నాన్నా! పావలా ఇయ్యి! ఐసు కొనుక్కుంటాం!" అంటూ అడగ్గానే, చిన్నాన్న డబ్బులు తీసి ఇవ్వగానే ఐసు కొనుక్కొనేవారు.

బండిలో ఓ పెద్ద ఐసుదిమ్మ ఉండేది. దాని చుట్టూ రంగునీళ్ల సీసాలు — ఆ మనిషి ఐసు చిత్రికపట్టి, చెక్కు తీసేవాడు. ఆ చెక్కుని ఒక చిన్న గ్లాసులో కుక్కి, అందులో ఒక పుడక గుచ్చి, గ్లాసులోంచి ఆ కోనుని విడదీసి, ఆ కోనుమీద రంగు సిరప్ పోసి ఇచ్చేవాడు — కాని దానిని ఆప్యాయంగా తినేవారు.

ఇలా, తెల్లవారు లేచిందగ్గర్నించి చిన్నాన్న ఇంట్లో అందరికీ తిండిగోల తప్ప మరో పని లేదని పించింది శ్రీనుకి. ఎవరికీ మంచి బట్టలులేవు. ఆడపిల్లలకి కూడా చింకి గౌన్లు — మగపిల్లలకి అతుకుల లాల్చీలూ, నిక్కర్లూనూ. పిన్నమ్మ చీరలూ అలానే ఉండేవి.

కాని ఏమున్నా మానినా, తిండీ, చిరుతిండీ మాత్రం వేళకి పడిపోయేది. తాటి ముంజలు, మామిడిపళ్లూ ఇంటికి అమ్మకానికి వచ్చేవి. పిల్లలు ఎవరి కిష్టమయినవి వారు బియ్యం ఇచ్చి, కొనేసు కొనేవారు!

అందువల్ల, తెచ్చిన బస్తా బియ్యంలోనూ సావుబస్తా బియ్యం ముంజలూ, పళ్లూ, కూరలూ కొనడానికే అయిపోయేవి. నెల నిండకుండా బియ్యం నిండుకోగానే, "మరోసావుబస్తా బియ్యం పడించండి!" అని పిన్నమ్మ అనగానే, "సరే!" అనేవారు చిన్నాన్న.

ఈ ఇంట్లో వ్యక్తుల జీవితం గమనించగా, హాయిగా ఎంత చీకూ చింతా లేకుండా గడిపేస్తున్నారు! అనిపించింది శ్రీనుకి.

ఓనాడు శ్రీను, తనకన్న పెద్దవాడైన రమణని అడిగేడు — "ఒరే రమణా! చిన్నాన్న జీతం ఎంతరా?" అని.

"మా నాన్న జీతం ఎంతయితేనేంరా? రోజుకి మూడూ, నాల్గూ పైన దొరుకుతుంది" అన్నాడు గొప్పగా.

కాని ఎంత పైరాబడున్నా, నెలా వచ్చేసరికి చిన్నాన్న జీతంలోంచి కాఫీ హోటల్‌కి ముందు అప్పు తీర్చేవారు — వాడి బాకీ తీర్చకపోతే మర్నాడు టిఫిన్లు దొరకవుగా! యాభై రూపాయలు వాడికి పోతుంది—కిరాణా కొట్టువాడి బాకీ వందా యాభై అయితే వాడికి వంద ఇచ్చి, యాభై బాకీ ఉంచేవారు. పాలవాడికి బాకీ — ఇంటికి రెండునెలల అద్దె బాకీ — ఇలా ఎన్నెన్నో చిల్లర మల్లర బాకీలు.

శ్రీను అనకాపల్లిలో ఆనందంగా గడిపి, ఇంటికి తిరిగి వచ్చాక, చిన్నాన్న పెద్ద ఉత్తరం

## తేడా

ఆకాశపు చీకటి కంఠాన్ని
ఆశయాల గండ్రగొడ్డలితో ఉత్తరించి
ఉదయాన్ని ఉదయింపజెయ్యాలనే వాడివి
నువ్వు
రేయి గడవనిదే
'రేపు' పుట్టదనీ
ఈలోగా
తేజస్సును స్వీకరించేందుకు
మనస్సుల్ని ఉతికి ఆరవెయ్యాలనీ
తమస్సులో కూచుని
రస తపస్సు చేస్తున్నవాణ్ణి
నేను !

— కేవస్వీ

రాసేరు నాన్నకి. అప్పులు చాలా అయిపోయేయిట. డబ్బు ఎంతయినా అవసరం ఉందిట. అందుకు పార్వతీపురంలోని ఇల్లు అమ్మేసి ఆ వచ్చిన సొమ్ము నాలుగు భాగాలువేసి, ముగ్గురు అన్నదమ్ములూ మూడు భాగాలు, నాన్నమ్మకి ఒక భాగం ఇవ్వమని — అదికాక, వెంటనే ఓ వంద రూపాయలు మనియార్డరు చెయ్యమని.

ఆ ఉత్తరం చదవగానే అమ్మ దండకం ఆరంభించింది — "అందుకే అన్నాను ! శ్రీనుగాడ్ని అక్కడికి పంపకండీ అని ! కాస్త దగ్గరగా పులుముక తిరగ్గానే చాలు, యాభైతే, వందతే అంటూ ఉత్తరాలు ! పూచీ పేచీ లేని బతుకు ! అవి కాఫీ హోటళ్లేమిటి, అవి సినిమాలేమిటి ! ఆ తండ్రికి తండ్రీ అంతే ... పిల్లలకి పిల్లలూ అంతే ! అప్పులు పెరిగిపోయేసరికి అన్నదమ్ములమీద పడడం ! ఊరి వాళ్లమీద అప్పుల కోసం చెయ్యి చాచడం ! అడక్కుండుకి సిగ్గూ సరం ఉండవుకామోసు ! ఇంక ఆ పిత్రార్జితం కొంప ఇంతోటే అమ్మేద్దామని చూస్తున్నట్టుంది ! అమ్మడానికి వీల్లేదని రాయండి !" అంటూ ఓ లెక్చర్ కొట్టడమే కాక రోజల్లా గొణుగుతూనే ఉంది !

నాన్నమ్మ వెంటనే కలుగజేసుకుంది — "పిల్లలవాడే ! ఖర్చులుంటాయి మరి ! రోజు రోజుకీ ధరలు మండిపోతున్నాయా ఇంకేమన్నానా ? పార్వతీపురంలో ఆ కొంప ఉండీ ఏం లాభం ? అక్కడెవరూ ఉండడంలేదుకదా ? — అద్దెలవాళ్లు సరిగా అద్దె ఇవ్వడంలేదుకదా ? అమ్మేయండి — నా వొంతు కూడా మీరు ముగ్గురూ పంచేసుకోండి — ఇవాళా రేపో కునికేసేదాన్నేం చేస్తాను ఆ డబ్బుతో?" అంది —

"అదేమిటత్తయ్యా ? మీ డబ్బు ఏం చేస్తామంటున్నారు ? ఆ డబ్బు మీ పేరనే ఉండనీయండి— ఆ సొమ్ము కూడా మీకు లేకపోతే మిమ్మల్నెవరూ ఖాతరు చెయ్యరు !" అమ్మ అంది.

"కన్న తల్లికే ఇన్ని గంజినీళ్లు పొయ్యరటే ?"

## స్పందన

"ఏదీ ? మీ చిన్నకొడుకులిద్దరూ మీ సంగతే ఎప్పుడన్నా పట్టించుకున్నారూ? చాకిరీ చేపినన్నాళ్లూ మీచేత చేయించుకున్నారు. ముసలి కాలం వచ్చేసరికి అమ్మ మరి ఎవరికీ అవసరంలేదు — అన్నింటికీ పెద్దకొడుకూ, పెద్దకోడలే ! మీరేమో నా రెండో కొడుకో, నా మూడో కొడుకో అంటారు ! వాళ్లమీద అభిమానం ఒలకబోస్తారాయె !" అమ్మ ఎత్తిపెడుతుంది.

"పోనీలే అమ్మలూ ! ఎవరెలాపోతే మనకేమే ? నువ్వూ కాశీ, గొంతులో ఇన్ని తులసినీళ్లు పోస్తారు కదా ప్రాణం పోయేటప్పుడు ! చాలు ! పోనీ... నా డబ్బు పంచుకున్నా మానినా, వాడికి పాపం డబ్బు జాసరం ఉన్నట్టుంది — ఇల్లు అమ్మండి — నా సొమ్ము నీ దగ్గరే ఉండనీ !" అనేసరికి అమ్మకి కోపం తగ్గింది.

అమ్మ ఆలోచించింది — తమకీ ఎన్నో డబ్బు అవసరాలున్నాయి. రామం కాలేజిలో చేరుతాడు వచ్చే ఏడు — చంపా పెద్దమనిషయి కూర్చోవచ్చు ఏ నిముషమన్నా ! దానికో మొగుణ్ణి చూడాలి కదా? ఇవాళ కాపోయినా, మరో నాలుగేళ్ల తరవాతన్నా దానికి సంబంధం చూసి పెళ్లి చెయ్యాలి కదా ? ఇల్లు అమ్మితే ఎంత లేదన్నా ఎనిమిది తొమ్మిది వేలన్నా రాదా ? తమ వంతు రెండువేలొస్తుంది. కొన్ని అవసరాలన్నా తీరతాయి. ముసలావిడ వంతు వడ్డీకిస్తే నెల నెలా డబ్బొస్తుంది. ఆమె ఎవరి దగ్గరుంటే వారికా వడ్డీ చెందుతుంది.

అమ్మ రోజూ రాత్రి ఈ విషయమై నాన్నతో గుసగుసలు. ఆ గుసగుసలు అందరికీ వినిపించేవి. కిందా మీదా ఆలోచించినమీదట పార్వతీపురం ఇంటిని అమ్మడానికే నిశ్చయించుకున్నారు — విజయవాడలో ఉన్న చిన్న తమ్ముడితో సంప్రదించగా, "నీ ఇష్టం కాశీ ! నాకేం అభ్యంతరం లేదు !" అని రాసేడు.

"అతగాడికేం బ్యాంకులో ఆఫీసరు ! నెలకి ఎనిమిది వందలొస్తాయి — తన పుట్టింటివారికే అంత సంపదా ఉందని ఆవిడ మిడిసిపడిపోతుంది ! ఓ నాడన్నా తల్లిని తీసుకవెళ్లి ఓ నాలుగు దినాలుంచుకున్నారా ? అతడి భాగంలోది సగం మనకిమ్మని రాయండి !" అంటూ పురికొల్పింది అమ్మ.

"నేను పిల్లలవాడ్ని ! నీ భాగం డబ్బు కూడా నాకే ఇవ్వవలిసింది. పిల్లలవాడ్ని !" అంటూ అనకాపల్లి చిన్నాన్న అప్పుడే రాసినట్టు తరవాత తెల్సి, అమ్మ ముక్కుమీద వేలు వేసుకుంది.

"చూసేరా ! డబ్బు అనేసరికి ఎక్కడిలేని తెలివితేటలూ అందరికీ ఎలా పుట్టుకొస్తాయో ?" అంది అమ్మ నాన్నతో.

(ఇంకా ఉంది)

పెద్దకథ

# ప్రేమిస్తే ఏమౌతుంది!

విన్నకోట సుశీలాదేవి

(గత సంచిక తరువాయి)

రాధ నడకలోనూ, మాటల్లోనూ ఏదో ప్రత్యేకత కన్పించింది స్వాతికి. రవి స్వాతినే గమనిస్తున్నాడు.

"రాధా! వారికి ఇల్లు చూపించు" అన్నాడు రవి.

రాధ ఇల్లంతా చూపుతూ ఒక గదిలోకి తీసికెళ్ళి —

"ఇది బావ గది! బావకి బొత్తిగా శుభ్రం తెలీదండి! సామాన్లు ఇష్టంవచ్చినట్లు పడేస్తాడు. నేనే సర్దాలి! నేను సర్దితే మాత్రం, రాధా ఇప్పుడు ఈ గదిలో కాస్త వుండబుద్ధవుతోంది అంటూ మెచ్చుకుంటాడు" అంది.

మిగతా గదులకంటె ఆ గది చాలా అందంగా వుంది. తర్వాత దొడ్లోకి తీసికెళ్ళి మొక్కలు చూపించింది.

"నాకు మొక్కలంటే సరదా! ఇవన్నీ నేను కొని వేసినవే" అంది రాధ.

ఒక ప్రక్కగా వున్న గులాబీలను చూపుతూ —

"బావకు గులాబీలంటే చాలా ఇష్టం! బావ కోసమని తెప్పించి పెంచుతున్నాను" అంది.

రాధ ప్రతి మాటలోనూ ఆ పిల్లకు రవిమీద గల ప్రేమ వ్యక్తమౌతోంది. అది స్వాతికి రంపపు కోతలావుంది.

"రండి! వాకిట్లోకి వెళ్ళి అక్కడున్న మొక్కలు చూద్దాం" అంది రాధ.

రాధ నోటి వెంట ఇక రవి పేరు వినలేదు. అందుకే —

"ఇందాక వస్తుంటే ఆ మొక్కలు చూశాను" అంది స్వాతి.

ఇద్దరూ హాల్లోకి వచ్చారు.

**జరిగిన కథ—1 :** రెవిన్యూ డిపార్ట్‌మెంటులో తాసిల్దారుగా పనిచేసి రిటైరయిన గోవిందరావుకు, ఆయన భార్యకు ఇద్దరు మగ పిల్లల తర్వాత పుట్టిన స్వాతి అంటే అమితమైన గారాబం. స్వాతి ఓ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తూంటుంది. ఉమ కోరికమీద ఆమె బర్త్‌డే పార్టీకి వెళ్ళిన స్వాతికి అక్కడ రవి పరిచయమౌతాడు. స్వాతి ఇంటికి రవి రాకపోకలు సాగిస్తుంటాడు. ఆమెలో అతను చోటు చేసుకొంటుంటాడు. రవి మాటల్లో తన మావయ్య కూతురు రాధ విషయం రాగా ఎందుకో అతను తనని మోసం చేస్తున్నాడేమో! అనే అనుమానం చిగురుస్తుంది స్వాతిలో.

కాని ఈ రోజు మనసంతా చికాగ్గా, అశాంతిగా వుండటంవలన ఆ మాటలకు ఏం సమాధానం చెప్పలేదు.

రవి స్వాతి ముఖంలోకి చూశాడు.

రోజూ కన్పించే వెలుగు ఈనాడు ఆమె ముఖంలో లేదు.

"స్వాతి! మీరు మా ఇంటికి వచ్చిన తర్వాత మీకేదైనా అనుమానముంటే నన్నడగండి! అంతేకానీ మనసులో పెట్టుకుని బాధపడకండి!" అన్నాడు.

స్వాతి రవి ముఖంలోకి చూసింది! రవి కళ్ళల్లో ఏ భావం కన్పించిందో కానీ —

'అలాగే' నంటూ తలూపింది.

"ఇక వెళ్దామా!" అంటూ రవి లేచాడు.

స్వాతి ఇంట్లోకి వెళ్ళి తల్లితో చెప్పి రవితో బయటికి నడిచింది. ఇద్దరూ బస్సెక్కారు.

బస్సు దిగాక రవి అన్నాడు —

"కొద్ది దూరమే నడుస్తారా?"

"ఊఁ" అంది స్వాతి.

రెండు సందులు తిరిగి ఒకచోట ఆగాడు.

"స్వాతీ! ఇదే మా ఇల్లు!"

ఎదురుగా చిన్న డాబా కన్పించింది. గేటు తీస్తూ — "రండి!" అన్నాడు. ఇద్దరూ లోపలికెళ్ళారు.

ఇంటిముందు చక్కని పూలతోట వుంది. ఇల్లు చిన్నగా వున్నా అందంగా వుంది.

వరండా దాటి హాల్లోకి నడిచారు! స్వాతిని 'కూర్చో' మని తను లోపలికెళ్ళి అమ్మనీ, రాధనీ పిల్చుకొచ్చాడు.

"ఈవిడే మా అమ్మగారు. పేరు శారదమ్మ. ఈ అమ్మాయి రాధ!"

"అమ్మా! వీరు స్వాతి అని నా ఫ్రెండ్!" అంటూ పరస్పరం పరిచయం చేశాడు రవి.

స్వాతి నమస్కారం చేసింది.

రవి తల్లికి దాదాపు యాభై ఏళ్ళుంటాయి. సన్నగా, తెల్లగా వుంది.

స్వాతి రాధవేపు చూసింది. రాధ చామన ఛాయతో ఆకర్షణీయంగానే వుంది.

"కూర్చోమ్మా!" రవి తల్లి అంది.

స్వాతి కూర్చుంది!... స్వాతి తెలిసినవాళ్ళతోనే సరిగ్గా మాట్లాడలేదు. కొత్తవాళ్ళతో అస్సలు మాట్లాడదు.

శారదమ్మగారే స్వాతి కుటుంబ విషయాలు అడిగింది.

ఈలోగా రాధ కాఫీ తెచ్చిచ్చింది.

స్వాతి చూపంతా రాధమీదే వుంది.

రవి అలాగే కూర్చున్నాడు. శారదమ్మ వంటింట్లో పనిమీద వుంది.

స్వాతి వంటింటి గుమ్మం దగ్గరికొచ్చి — "వెళ్ళొస్తానండి" అంది.

ఆవిడ స్వాతివేపు చూస్తూ — "వుండమ్మా! కాస్త టిఫిను తిని వెడుదువుగాని" అంది.

"లేదండి! మళ్ళీ బస్సులు అందవు. ఇప్పటికే చీకటి పడింది. ఇంకోసారి వచ్చినప్పుడు తప్పక తింటాను" అని హాల్లోకి వచ్చి రవితో — "వెళ్ళొస్తానని" చెప్పింది.

రవి లేచి స్వాతి వెంట నడిచాడు. గేటు వరకూ వచ్చిన రాధతోకూడా చెప్పి గేటు తీసుకుని బయటకు వచ్చింది స్వాతి.

రవి, స్వాతి ప్రక్క ప్రక్కన నడుస్తూ బస్ స్టాప్ చేరారు.

"స్వాతీ! రేపు వస్తాను మీ ఇంటికి."

స్వాతి ఏం సమాధానం చెప్పలేదు. రవి ఏదో అనబోయి స్వాతి ముఖం చూసి వూరుకున్నాడు.

స్వాతి బస్సెక్కాక రవి చెయ్యి వూపాడు. స్వాతి ముఖం తిప్పుకుంది. రవి మనస్సులో సన్నటి బాధ చిచ్చిక రేగింది.

ఆక్షణంలో స్వాతి వెనకే బస్సెక్కి ఆమె ఇంటికి వెళ్ళాలన్పించింది. కాని బలవంతాన నిగ్రహించుకున్నాడు.

* * *

ఆ మర్నాడు అయిదవుతుండగానే స్వాతి ఇంటికి వెళ్ళాడు రవి.

అప్పటికింకా స్వాతి ఇంటికి రాలేదు. పుస్తకం తిరగేస్తూ గదిలో కూర్చున్నాడు.

పావుగంట గడిచాక వచ్చింది.

రవి ఆత్రంగా స్వాతి ముఖంలోకి చూశాడు. ఇంకా స్వాతి ముఖంలో నీలినీడలు కదలాడుతూనే వున్నాయి.

"స్వాతీ! నిన్న మీరు వెళ్ళిన తర్వాత ఎంత మానసికవేదన అనుభవించానో తెలుసా! రాత్రి నిద్ర పట్టలేదు. ఎప్పుడెప్పుడు సాయంత్రం అవుతుందా! ఎప్పుడు మిమ్మల్ని కలుసుకుంటానా? అని ఎంతో ఆరాటపడిపోయాను."

రవి కంఠంలోని ఆవేదనకి చలించిపోయింది స్వాతి. మనస్సు బాధగా మూలిగింది. అదే!... అదే! ఆ మాటలే! తనని నిలువునా స్పందింపచేసేవి. అవే రవిమీది కోపాన్ని పటాపంచలు చేసేవి.

రవీ! మీ మాటల్లో ఎందుకంత తియ్యదనం!

మీ చూపుల్లో ఎందుకంత మెరుపు!

రవితో అస్సలు మాట్లాడవద్దనుకుంది. అతనివేపే చూడొద్దనుకుంది. ఒకవేళ మాట్లాడినా రాధ విషయం చెప్పనందుకు పోట్లాడాలనుకుంది. కానీ, ఏం చెయ్యలేకుండా వుంది. ఎందుకీ బలహీనత తనలో? ...

"స్వాతీ!"

స్వాతి కుర్చీమీద పెట్టుకున్న చేతిని పట్టుకుని చిన్నగా ముద్దు పెట్టుకున్నాడు.

స్వాతి ఈ హఠాత్సంఘటనకు వణికింది.

కానీ ఏదో తియ్యటి అనుభూతి నరనరాన పాకింది.

'రవీ! నేను పూర్తిగా ఓడిపోయాను' అనుకుంది.

# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే తన్నులకింపైన 14 రంగులలో దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు

**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం




అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600033

Imageads-AL-1240 R-Tel




''స్వాతీ ! మీరలా మౌనంగా కూర్చుంటే నేను చూడలేను. ఏదన్నా మాట్లాడండి. అసలెందుకలా వున్నారు ? నా మీద కోపమా ?''

స్వాతి కాదన్నట్లు తలూపింది.

''మరి ?''

''కోపం కాదు. బాధ రవీ ! నన్ను మోసం చెయ్యకండి ! అదే నేను కోరేది'' పళ్లబిగువున అంది.

రవి తన చేతిలోవున్న స్వాతి చేతిని మృదువుగా నొక్కి — ''స్వాతీ ! ఏం మాటలవి. నా దేవతకు నేనెన్నడైనా ద్రోహం చేస్తానా ? అలా ద్రోహం చేసిన రోజున ఈ రవి జీవించి వుండడు !''

రవి కంఠం ఆవేశంగా పలికింది.

''రవీ !''

అంతకంటె ఎక్కువ మాట్లాడలేకపోయింది స్వాతి.

* * *

''స్వాతీ ! ఈ మధ్య సాయంత్రాలు తమ దర్శనమే కరువైపోతోంది !'' కళ్యాణి నిష్ఠురంగా అంది.

స్వాతి నవ్వుతూ — ''ఏంలేదే ! పనుండి.''

''పనా ! రోజూనా ! అంత తీరికలేని పను లేమిటో ?''

స్వాతి సమాధానం చెప్పలేకపోయింది. కళ్ళు మాత్రం సిగ్గుతో వాలిపోయాయి. స్వాతి పరిస్థితి చూసి కళ్యాణి — ''నేను చెప్పనా ?'' అంది నవ్వుతూ.

''ఉఁ ...''

''ఏవుంది ! అమ్మాయిగారు ప్రేమలో పడ్డారు. అంతేనా ?''

కళ్యాణి అలా కుండ బద్దలు కొట్టినట్లు చెప్పేసరికి స్వాతి సిగ్గుపడిపోయింది.

''చెప్ప ?''

స్వాతి 'అవున'న్నట్లు తలూపింది.

కళ్యాణి చటుక్కున స్వాతి దగ్గరగా కుర్చీ జరుపుకుని రహస్యంగా — ''ఎవరా అదృష్ట వంతుడు ?'' అంది. స్వాతి నవ్వుతూ — ''వివరాలు వెండితెరమీద !'' అంది.

''చాల్లే ! నా దగ్గర కూడా దాపరికమేనా ?'' అంటూ కోపగించుకుంది కళ్యాణి.

''అదికాదు కళ్యాణీ ! కొన్నాళ్ళు ఓపికపట్టు ! నేనే అతన్ని మీ ఇంటికి తీసుకొచ్చి పరిచయం చేస్తాను.''

''పోనీ ! కనీసం ఫొటో అయినా లేదా ?''

స్వాతి కళ్యాణి ముఖంలోకి చూసింది.

''ప్లీజ్ స్వాతీ ! చూపించవా ! ఈ అందాల బొమ్మ వరించినవాడు ఎంత అందగాడో తెలుసు కోవాలని ఆరాటంగా వుంది. నామీద ఆమాత్రం దయలేదా !'' బ్రతిమాలింది కళ్యాణి.

స్వాతి నవ్వుతూ టేబిల్‌మీద వున్న బ్యాగ్ చేతిలోకి తీసుకుంది.

''ఓహో ! ఫొటో బ్యాగులో వుంచుకునే తిరుగుతున్నావన్న మాట ! అయితే టెంపరేచర్ చాలా ఎక్కువగానే వుందే !''

స్వాతి సిగ్గుపడుతూ — బ్యాగ్‌లోంచి ఫొటో తీసి కళ్యాణి చేతిలో పెడ్తూ —

''ఎవ్వరికీ చెప్పకు !'' అంది భయంగా చూసి.

''ఛ ! ఎందుకు చెప్తాను ? నాకు మాత్రం తెలీదా !'' అంటూ ఫొటో చూసింది !... దాంతో నవ్వుతున్న కళ్యాణి ముఖం ముడుచుకుంది.

''స్వాతీ ! నువ్వు ప్రేమించింది ఇతడినా !'' అంది.

''అవును. ఏం ?'' — అదే భయం స్వాతిలో.

''స్వాతీ ! చాలా పొరపాటు చేశావ్ !'' —

''కళ్యాణీ ! అసలు విషయం చెప్పవే !'' అడిగింది మరీ భయంగా — ''రవికి పెళ్లయిందే !'' కళ్యాణి గట్టిగా చెప్పింది.

స్వాతి అదిరిపడింది ! !

''నిజమా కళ్యాణీ !''

''పెళ్లంటే ! ఒక విధంగా అయినట్లే ! అతనికి రాధ అనే మావయ్య కూతురుంది. చిన్నప్పుడు ఆ పిల్ల తండ్రి చనిపోయే సమయంలో ఆ పిల్లని చేసుకుంటానని దేవుడిముందు నిలబడి ప్రమాణం చేశాడు. ఆ తర్వాత తండ్రి పోయాక రవి తల్లి ఆ పిల్లని తెచ్చి పెంచింది. రాధ ఆ ఇంటి కోడలుగానే పెరిగింది. శారదమ్మ అలాగే చూసింది. రవికీ ఆ భావనే వుండేది. స్వాతీ ! అసలు రవి నీకెలా పరిచయం అయ్యాడే ?''

కళ్యాణి చెప్తున్న ప్రతి మాటా స్వాతి గుండెల మీద సమ్మెటలతో కొడ్తున్నట్లనిపించింది.

'రవికీ ఆ భావనే వుండేది...', 'రవికీ ఆ భావనే వుండేది !...' అన్న మాటలే చెవిలో గింగురు మంటున్నాయి !

''స్వాతీ ! ఇప్పటికైనా మించిపోయిందేంలేదు ! రవితో స్నేహం తెంచుకో ! లేకపోతే అనవసరంగా

[38 వ పేజీ చూడండి]

తప్పక చూడండి!

పూంపుహార్ ప్రొడక్షన్స్

# అమ్మాయి మొగుడు మామకు యముడు

ఈస్ట్‌మన్ కలర్



THARAKA PRABHU ADS.




మాటలు: త్రిపురనేని మహారధి

సంగీతం: ఎమ్.యస్. విశ్వనాధం

నిర్మాత: "మురసొలి" సెల్వం

దర్శకత్వం: అమృతం



'సంసారం—సంతానం'లో జయసుధ, శోభన్‌బాబు

## రిజిస్టర్ చేయబడిన చిత్రాల పేర్లు

కె. సి. ఫిలిమ్స్ ఇంటర్నేషనల్ ''నక్సలైట్'', శిరీషలక్ష్మి కంబైన్స్ ''లలిత'', ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ ''ఎంటర్ ది డ్రాగన్'', విజయలక్ష్మి పిక్చర్స్ ''సీక్రెట్ ఏజెంట్'', యునైటెడ్ ఆర్ట్ మూవీస్ ''కన్యాశుల్కం'', జనచిత్ర ''విముక్తి'', రవీంద్ర ఫిలిమ్స్ ''బంగారు కానుక'', కార్తీక ఫిలిమ్స్ ''నా ఇల్లు — నా దేశం'', డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ ''కోహినూర్'', బ్రహ్మాజీ పిక్చర్స్ ''జీవిత మాధుర్యం'', స్వాతి చిత్ర ''స్వాతి'', లక్ష్మీ బాలాజీ చిత్ర ''త్యాగమూర్తి'', సింహా ఇంటర్నేషనల్ ''పుణ్యభూమీ కళ్ళు తెరువు'', నారాయణ ఆర్ట్ మూవీస్ ''శివశక్తి'', భావనా ఫిలిమ్స్ ''బ్లాక్ కాట్'', వైజయంతి పిక్చర్స్ ''సుమంగళి వరం'', జనచిత్ర ''ఉదయం'', వీణా వాహినీ పిక్చర్స్ ''ఈనాటి సీత'', ఇంటర్‌ఫిలిమ్స్ ''సుబ్బారాయుడి పెళ్ళి'', సరాగ చిత్ర ''సావి — సంసారి'', శ్రీ అలయమ్మన్ క్రియేషన్స్ ''భార్యా భర్తల సవాల్'', విష్ణుప్రియా ప్రొడక్షన్స్ ''మనవడు — మనవరాలు'', టి. వి. ఆర్. మూవీస్ ''శ్రీదేవి—భూదేవి'', ఘంటసాల ఆర్ట్స్ ''ఘంటసాల కథ'', రాధాకృష్ణా క్రియేషన్స్ ''అత్తిల్లు—పుట్టిల్లు'', డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ ''కిరాయి రౌడీ'', శ్రీ సావరిన్ ఫిలిమ్స్ ''నవలా నాయిక'', శ్రీరాం ఆర్ట్ పిక్చర్స్ ''స్త్రీ హృదయం''.



## డైరెక్టర్ కట్టా సుబ్బారావు చిత్రావళి

''వియ్యాలవారి కయ్యాలు, కొంటె మొగుడు—పెంకి పెళ్ళాం, కోడళ్ళొస్తున్నారు జాగ్రత్త, మొగుడు కావాలి'' చిత్రాలతో ప్రజాభిమానాన్ని విశేషంగా చూరగొన్న కట్టా సుబ్బారావు ''పెళ్ళి గోల, బంగారు బావ, గడసరి అత్త — సొగసరి కోడలు, శ్రీరస్తు — శుభమస్తు'' అనంతరం డిసెంబర్ నుంచి శోభన్‌బాబుతో రూపశిల్పి పోతరాజు నిర్మించే సరిగమ ప్రొడక్షన్స్, ''శుభోదయం'' చిత్ర నిర్మాత సి. హెచ్. నరసింహారావు నిర్మించే చిత్రం, 'ప్రేమ నాటకం' అనంతరం పరిమళా ఆర్ట్ క్రియేషన్స్ నిర్మించే కొత్త చిత్రం, జనవరి నుంచి మురళీమోహన్, నూతన్‌ప్రసాద్, శారదలతో టి. కె. ఎం. ఛటర్జీ నిర్మించే పద్మావతీ ఇంటర్నేషనల్ వారి చిత్రం, వి. కె. భరద్వాజ ఆధ్వర్యంలో ఫిబ్రవరి నుంచి చరిత చిత్ర మొదలెట్టే చిత్రం, జక్కంపూడి సత్యనారాయణమూర్తి — నిమ్మకాయల ధర్మిలి నిర్మించే కల్యాణ శ్రీనివాస ఫిలిమ్స్ చిత్రం, పి. ఎ. పి., ఎస్. పి. వెంకన్నబాబు, 'జ్యోతి' కె. సి. శేఖర్‌బాబు నిర్మించే చిత్రాలకు దర్శకత్వం వహిస్తారు.

## కె. విశ్వనాథ్ దర్శకత్వంలో మరో చిత్రం

కె. విశ్వనాథ్ దర్శకత్వంలో తయారయ్యే సంగీత నృత్య ప్రధాన చిత్రంలో కమలహాసన్ నాయకుడని నిర్మాత వి. వి. శాస్త్రి చెప్పారు. మహదేవన్ సంగీత దర్శకుడు. ''జనవరిలో సాంగ్స్ రికార్డు చేస్తాం. ఫిబ్రవరి నుంచి షూటింగ్ ప్లాన్ చేశాం,'' అన్నారు ఎగ్జిక్యూటివ్ నిర్మాత అల్లు అరవింద్. జంధ్యాల సంభాషణలకర్త. తమిళంలో కూడా తయారౌతుందని ఈ చిత్రాన్ని సమర్పించే చేగొండి హరిబాబు తెలిపారు.

## దర్శకుడుగా రచయిత విద్వాన్ కణ్వశ్రీ

''ఉత్తమ కథావస్తువులు తీసుకొని, చక్కని దర్శకత్వ స్థాయితో చిత్రీకరిస్తే తెలుగు ప్రేక్షకులు తప్పక ఆదరిస్తారు. వాళ్ళ అభిరుచుల్ని మనమే వెడగొట్టి, వాళ్ళ స్థాయిని పడగొట్టాం. అయినా వాళ్ళు మాత్రం నలభై ఏళ్ళనాటి 'వందేమాతరం' చిత్రం లగాయితు ఈనాటి వరకూ అనేక ఉత్తమ కథా చిత్రాలను ఆదరించారు. చక్కని చిత్రాలను ఆదరించడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉన్నారు. ఇందుకు 'శంకరాభరణం' చక్కని నిదర్శనం. నన్నభిమానించే కొందరు మిత్రుల సహకారంతో నా 'ఇదా ప్రపంచం' నాటకాన్ని స్వర్ణకమల్ ప్రొడక్షన్స్ పతాకంలో తెరకెక్కించడానికి నిశ్చయించాను. పాతికేళ్ళముందు నేను రాసిన ఆ నాటకం ఆంధ్రదేశం నలుమూలలా బహుళ ప్రచారం పొందింది. నాటక రచయితగా, ప్రయోక్తగా తెలుగుదేశంలో నాకొక స్థానం కల్పించిన నా తొలి రచన అదే. ఆ తర్వాత నేను రాసిన 'సామ్రాట్ చంద్రగుప్త, ఆనాడు, అంకుశం, లవ్ ఈజ్ నాట్ బ్లైండ్' వగైరా నాటకాల కన్నా 'ఇదా ప్రపంచం' మీద నాకు ప్రత్యేకాభిమానం ఉంది. దాన్ని చిత్రంగా తీయాలనే సంకల్పం ఇప్పుడు నా మిత్రుల ప్రోత్సాహంవల్ల ఫలించింది. చిత్రానికి వేరే టైటిల్ నిర్ణయిస్తామనుకోండి. ముగ్గురు హీరోలు, ముగ్గురు హీరోయిన్లు, రెండు దుష్ట పాత్రలు, ఒక ప్రధానమైన తండ్రి పాత్ర, హాస్య ప్రధానమైన మరికొన్ని పాత్రలూ ఉన్నాయి. కొందర్ని ఎన్నుకోవడం కూడా జరిగింది. తెరకు కొత్తవారైనా — నటనకు కొత్తవారు కానివారే నా చిత్రంలో నటిస్తారు. దర్శకత్వభారాన్ని కూడా నామీద మోపారు నా మిత్రులు. దర్శకుడనిపించుకోవాలనే పేరాశ లేకపోయినా — ఆ నాటకం నా హృదయం లోంచి వెలువడిన ఆవేశం కనుక, దానికి న్యాయం చేకూర్చాలనే సదాశయంతో ఈ బాధ్యతను అంగీకరించాను. పైగా, ఆ నాటకంలో నేను అప్పట్లో రంగస్థలంమీద చూపెట్టలేకపోయిన కొన్నిభావాలు అలాగే నా మనసులో గూడు కట్టుకొని ఉండిపోయాయి. వాటిని తెరమీదికి తీసుకువద్దామనే ఉత్సాహం కూడా ఇందుకు కారణం. సినిమా రచయితగా గడించిన పాతికేళ్ళ అనుభవం కూడా నాకు కొంత ధైర్యం కలిగించిందని చెప్పవచ్చు. వాదనపల్లి, నెల్లూరు, ఆచంట, నాగార్జునసాగర్, భద్రాచలం ప్రాంతాల్లో చిత్రీకరణ జరుగుతుంది. స్టూడియో పని చాలా కొద్ది. ఆరు పాటలుంటాయి. వాటిని త్వరలో రికార్డ్ చేస్తాం. హడావిడి, హంగామా లేకుండా నిరాడంబరంగా చిత్ర నిర్మాణం సాగించి, చిత్రంలో నన్ను చూపించాలని మా సంకల్పం,'' అన్నారు విద్వాన్ కణ్వశ్రీ, బి. ఏ.



'ప్రేమాభిషేకం'లో ఒక దృశ్యం



'శ్రీవారి ముచ్చట్లు'లో జయప్రద, జయసుధ —ఫొటో : శ్రీధర్

## సినిమా

### విడుదలకు సిద్ధంగా ఉన్న పటాలం పాండు

ఎస్. డి. లాల్ దర్శకత్వంలో రవి చిత్ర ఫిలిమ్స్ అధినేత వై. వి. రావ్ నిర్మించిన "పటాలం పాండు" చిత్రంలో మోహన్‌బాబు, సుభాషిణి, మోహన్, త్యాగరాజు, భీమరాజు, బిందుమాధవి, హలం పాల్గొన్నారు. గొల్లపూడి, చక్రవర్తి, విలియమ్స్, చలం తెరవెనుక కృషి చేశారు. "డిసెంబర్‌లో ఈ చిత్రం విడుదలవుతుంది. కొమ్మినేని స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కొత్త చిత్రాన్ని కృష్ణంరాజు హీరోగా త్వరలో మొదలెడ్తాను. సత్యం సంగీత దర్శకుడు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. మిగతా టెక్నీషియన్స్ మా రవి చిత్ర యూనిట్‌లోని వారే" అని తెలిపారు వై. వి. రావ్.

### శ్రీ అయ్యప్ప కథ

"గతంలో 'శ్రీ స్వామి అయ్యప్ప' అనే చిత్రం మన రాష్ట్రంలో విడుదలైంది. అందులో స్వామి అయ్యప్ప లీలలు మాత్రమే చూపబడ్డాయి. ఐతే, గాయత్రి పిక్చర్స్ 'శ్రీ అయ్యప్ప కథ'లో స్వామి అయ్యప్ప జననం నుంచి దైవత్వం పొందేవరకు పూర్తి గాథ చిత్రీకరించబడింది," అన్నారు సురేంద్ర ఆర్ట్ పిక్చర్స్ అధినేత సురేంద్ర. ఈయన సమర్పి[illegible]త్రాన్ని కీ॥ శే॥ శ్రీరాములునాయుడు దర్శక[illegible]స్. ఎన్. పి. సుందరరాజన్ నిర్మించా[illegible] పద్మిని, అంబిక వగైరా తారలు[illegible] పీటూరి మాటలు, జె. వి. రాఘవ[illegible]తం, నాగేశ్వరరావు కూర్పు తెరవెనుక హంగులు.

### డిసెంబర్ నుంచి ఎర్రమల్లెలు

"ఆరు పాటలు రికార్డు చేశాం," అన్నారు నవతరం పిక్చర్స్ రథసారథి, కథకుడు, నటుడు మాదాల రంగారావు, ఎం. ఎ. ఈ సంస్థ ద్వితీయ చిత్రం "ఎర్రమల్లెలు"కు సి. నారాయణరెడ్డి, అదృష్టదీపక్, ప్రభు, కొండవీటి వెంకటకవితో పాటు ఈ చిత్రం దర్శకుడు ధవళసత్యం కూడా ఒక పాట రాశారు. ఎం.జె. రామారావు, చక్రవర్తి, జి. మోహన్‌కృష్ణ, రావి వెంకటేశ్వర్లు, నాయని మహేశ్వరరావు, 'విశ్వశాంతి' కె. రాధాకృష్ణ తెర వెనుక కృషి చేస్తారు. "డిసెంబర్‌లో టంగుటూరు గ్రామంలో షూటింగ్ ప్రారంభమై, ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది. ముగ్గురు హీరోయిన్‌లుంటారు — కొత్తవారినే ఎన్నిక చేయదలచాం," అన్నారు మాదాల రంగారావు.

### శ్రీ లక్ష్మీనారాయణ వైభవం

జననీ సినీ ప్రొడక్షన్స్ వారి ద్వితీయ భక్తి రస చిత్రం — శ్రీ లక్ష్మీనారాయణుడి భక్తుడైన సుందరదాసు గాథ. నేపాల్, హిమాలయాలు, హృషీకేశ్, బదరీ, మధురలలో ఉన్న వైష్ణవాలయాల వైభవం ఈ చిత్రంలో ప్రాధాన్యం కలిగేలా చిత్రీకరింపబడిందని నిర్మాత చామర్తి శ[illegible]ంతల్ వివరించారు. శరత్‌బాబు, లత, కె. ఆర్. విజయ, విజయకుమారి, శ్రీప్రియ, మనోహర్ ప్రభృతులు పాల్గొన్నారు. శ్రీ చందర్ సంభాషణలకర్త. విశ్వనాథం, శంకర్ సంగీతంలో ఆరుద్ర గీతాలు రాశారు. రాజారాం ఛాయాగ్రాహకుడు. కె. శంకర్ దర్శకుడు. ఈ చిత్రం డిసెంబర్ విడుదల.

### ప్రణయగీతం

"ఒరుకై ఓసై" అనే తమిళ చిత్రం ఆధారంగా డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ డిసెంబర్ 15 నుంచి జనవరి 20 వరకు తూర్పుగోదావరి జిల్లాలోని పల్లెసీమలలో నిర్మించే చిత్రానికి పై పేరు నిర్ణయించినట్లు నిర్మాత డి.వి.ఎస్. రాజు చెప్పారు. పి. సాంబశివరావు దర్శకత్వం వహించే ఈ చిత్రంలో చంద్రమోహన్, సుజాత, నూతన్‌ప్రసాద్ ముఖ్య పాత్రధారులు.

తమ పిల్లల పౌష్టిక
ఆహారం గురించి తల్లులు బాధపడుతుంటారు
అయితే సుచిత్రకు ఆ చింత లేదు...



"ఎందుకంటే, నేను మా పిల్లలకు రోజూ హార్లిక్స్ ఇస్తాను. హార్లిక్స్ ఇమ్మని డాక్టరు చెప్పినప్పటినుంచి, ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగటం మా పిల్లలకు అలవాటు చేసాను. హార్లిక్స్ రోజంతా వారిని ఆరోగ్యంగా, చలాకీగా ఉంచుతుందని నాకు తెలుసు.

**మీ పిల్లలకు మీరు కూడా హార్లిక్స్ ఇస్తారు. అవును కదూ?"**

Hx-6276 Tel.A

**మంచి పుష్టికరమైనది**




"హార్లిక్స్ ప్రధాన పుష్టిదాయక పానీయం. పుష్టిదాయకమైన ఆహార పదార్థాలతో అద్భుతంగా దాన్ని రూపొందించారు. హార్లిక్స్ ఏళ్ళ తరబడి నిరంతరంగా సత్ఫలితాలను చూపిస్తోంది. మీ కుటుంబ సభ్యుల ఆరోగ్యం కాపాడేందుకూ, వారు ఏరోజుకారోజు చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను మీకు సిఫార్సు చేస్తున్నాను."



హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్



'పార్వతీ పరమేశ్వరులు'లో చిరంజీవి, ప్రభ

## త్యాగమూర్తి

"పగలంతా ప్రెస్‌లో కష్టపడి, సాయంకాలం పేపర్లు అమ్మి, ఇద్దరు తమ్ముళ్ళను, గారాల చెల్లాయిని చదివించే కష్టజీవిగా రజనీకాంత్ ఓ కొత్తరకం పాత్రకు జీవం పోశాడు," అన్నారు పాత్ూరు వెంకటరత్నం. ఈయన సమర్పించే లక్ష్మీ బాలాజీ చిత్రవారి "త్యాగమూర్తి"లో జయలక్ష్మి, సంగీత, జయ, రాజన్‌బాబు, కాంచన, మల్లిక, జెమినీ రాజేశ్వరి, బేబీ వరలక్ష్మి పాల్గొన్నారు. కథ : పంజు అరుణాచలం. రచన : రాజశ్రీ. సంగీతం : ఇళయరాజా. ఛాయ : టి. ప్రసాద్. కూర్పు : విఠల్. నిర్మాత : పాత్తూరు మధుసూదన రావు. దర్శకత్వం : ఎస్. పి. ముత్తురామన్.



# సినిమా

## త్యాగయ్యలో కె. ఆర్. విజయ

త్యాగయ్యగా జె. వి. సోమయాజులు నటించే నవత సినీ ఆర్ట్స్ వారి చిత్రంలో త్యాగయ్య భార్య కమలగా కె. ఆర్. విజయ, అన్న జపేశంగా రావు గోపాలరావు నటిస్తారు. "డిసెంబర్‌లో ఆ సంగీత స్వరూపుడు పుట్టి మెట్టిన తంజావూర్ జిల్లాలోని పుణ్యస్థలిలో ఔట్‌డోర్ షూటింగ్‌తో నిర్మాణ కార్యక్రమం ఆరంభమవుతుంది," అన్నారు నిర్మాత ఎస్. కృష్ణంరాజు. బాపు దర్శకత్వం నెఱపే ఈ చిత్రానికి ముళ్ళపూడి వెంకటరమణ రచయిత, మహదేవన్ సంగీత దర్శకుడు.

## సెయింట్ పాల్‌గా విజయచందర్

"అంతా దైవేచ్ఛ!" అన్నారు 'కరుణామయుడు'గా ఎందరి హృదయాలనో చూరగొన్న విజయచందర్. ఆయన్ని ఆకస్మాత్తుగా ఓ చోట కృష్ణాజిల్లాలోని సంపన్నుల కుటుంబానికి చెందిన గోగినేని వెంకటేశ్వరరావు అనే యువకుడు చూడడం జరిగింది. ఆ యువకుడు పారవశ్యంతో "కరుణామయుడే కాదు; ఇంకా ఎందరో మహనీయుల పాత్రలను మీరు ధరించాలి. మీరు నాతో చేతులు కలుపుతానంటే 'సెయింట్ పాల్' చరిత్రను అంతర్జాతీయ ఖ్యాతి సార్జించేలా భారీ ఎత్తున నిర్మిస్తాం. సరేనవండి," అన్నాడు. ఉప్పొంగిపోతూ విజయచందర్ చేతులు కలిపాడు. తత్ఫలితంగా 'గోగినేని చిత్ర' అవతరించింది. "నేను నిమిత్తమాత్రుడ్ని. ఇదంతా ఆ కరుణామయుని కటాక్షం. ఆయన ఆశీస్సులతో ఆంధ్రులే కాక భారతీయులంతా గర్వించే చిత్రం తీయగలనన్న ఆత్మవిశ్వాసం నన్మల్ని త్వరితగతిన ముందంజ వేయిస్తోంది," అన్నారు విజయచందర్ ఆనందోద్రేకంతో.

## దాసరి పర్యవేక్షణ – దుర్గా దర్శకత్వం

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, పర్యవేక్షణలో దుర్గానాగేశ్వరరావు దర్శకత్వం వహించే నవజ్యోతి పిక్చర్స్ వారి ద్వితీయ చిత్రానికి డిసెంబర్, జనవరి నెలల్లో పాటలు రికార్డు చేయబడతాయనీ, ఫిబ్రవరి నుంచి షూటింగ్ ఉంటుందనీ నిర్మాత ఎస్. సాంబశివరావు తెలియజేశారు. ఈయన లోగడ "కల్యాణ చక్రవర్తి" చిత్రాన్ని నిర్మించారు.

## డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ చిత్రం

"రాజమండ్రి ప్రాంతాల్లో డిసెంబర్ నుంచి ఫిబ్రవరి వరకు ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది," అన్నారు నిర్మాత డి.వి.ఎస్. రాజు. వీరి కొత్త చిత్రానికి పి. సాంబశివరావు దర్శకుడు. చంద్రమోహన్, సుజాత, నూతన్‌ప్రసాద్ ఆదిగాగల తారలుంటారు. దాసం గోపాలకృష్ణ, రాజన్–నాగేంద్ర, తార, కళాధర్ వగైరా సాంకేతికవర్గం.

## రామలక్ష్మణులు

"ఇంతకుముందు ఊటీలో ఒక షెడ్యూల్ జరిపాం" అన్నారు సి. దండాయుధపాణి. ఈయన ఆర్. త్యాగరాజన్ దర్శకత్వంలో నిర్మించిన దేవర్ ఫిలిమ్స్‌వారి పై చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, మోహన్‌బాబు, గిరిబాబు, కె. వి. చలం, సారథి, నిర్మల పాల్గొంటున్నారు. ఆత్రేయ రచయిత. చక్రవర్తి సంగీత దర్శకుడు. రామ్మూర్తి ఛాయాగ్రాహకుడు. ఘంటసాల చిరంజీవి సహకార దర్శకుడు.

## సరిగమ ప్రొడక్షన్స్

"డిసెంబర్‌లో షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు రూపశిల్పి ఎ. పోతరాజు. ఈయన కట్టా సుబ్బారావు దర్శకత్వంలో నిర్మించే చిత్రానికి "బండి చక్రం" అనే తమిళ హిట్ పిక్చర్ ఆధారం. శోభన్‌బాబు, శ్రీదేవి, శరత్‌బాబు, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, చలం, రమాప్రభ, నిర్మల, కొత్త నటి సమిత పాల్గొంటారు. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, సత్యం సంగీతం ఇతర ఆకర్షణలు.

# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి రుచికి ఎల్లప్పుడూ నమ్మవచ్చును

గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

## మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చిన రుచి




OBM-6306A1 TEL R

'మనసా కవ్వించకే'లో ఒక దృశ్యం

'వూరుకి మొనగాడు'లో రావుగోపాలరావు, కృష్ణ



## సినిమా

### అన్నపూర్ణ స్టూడియోస్ హిందీలో నిర్మించే తొలి చిత్రం

దాసరి దర్శకత్వంలోనే "శ్రీవారి ముచ్చట్లు" చిత్రాన్ని హిందీలో శ్రీమతి అన్నపూర్ణ నాగేశ్వరరావు సమర్పణలో వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మిస్తారు. జితేంద్ర హీరో.

### పేదల బతుకులు

సి. హెచ్. వి. సూర్యనారాయణ, వెంకటేశ్వరరావు, యు. చినవీరరాజు నిర్మించే గీతా కృష్ణా క్రియేషన్స్ వారి చిత్రం పేరును "మనసులు మారాలి"గా కాక "పేదల బతుకులు"గా మార్చినట్లు డైరెక్టర్ వి. మధుసూదనరావు చెప్పారు. సుధాకర్, సుమతి, నారాయణరావు, చలం, కాంచన, రాళ్ళపల్లి, ప్రసాద్‌బాబు, లక్ష్మి చిత్ర, కల్పనారాయ్, అన్నపూర్ణ, మాస్టర్ కుమార్ పాత్రధారులు. బొల్లిముంత సంభాషణలకర్త. మహదేవన్ సంగీత దర్శకుడు. వి.ఎస్.ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు.

వ్యూబిలోకి దిగిపోతావ్! నీదసలే సున్నితమైన మనస్సు."

"కళ్యాణి! ఇప్పటికే కంఠంలోతు దిగిపోయానే!" ఏడుపుమొహం పెట్టింది స్వాతి.

"కళ్యాణి! రవి నీకెలా తెలుసు!" అనడిగింది ఎట్టకేలకు.

"రవి మాకు దూరపు చుట్టం!"

ఇక మాట్లాడలేదు స్వాతి! ఇంతలో గంట కొట్టారు. లెక్చరర్లు ఒక్కొక్కరూ రాసాగారు! కళ్యాణి ఫొటో స్వాతి కిచ్చేసింది.

"స్వాతీ! ముఖమంతా కమిలిపోయింది. వెళ్ళి ముఖం కడుక్కురా! ఎవరన్నా చూస్తే బాగుండదు" అంది.

ఆ పూట ఎలాగో పాఠాలు చెప్పాననిపించింది. లాస్ట్ అవర్ ఖాళీ! ప్రిన్సిపాల్‌ని పర్మిషన్ అడిగి ఇంటికి వచ్చింది స్వాతి. తల్లి ఇచ్చిన కాఫీ తాగి తన గదిలో మంచంమీద వాలింది. ఇందాకట్నించీ గుండెల్లో దాగిన బాధ కన్నీళ్ల రూపంలో బయటి కొచ్చింది. తనిన్నాళ్ళూ ప్రేమ కోసం ఎంత తపించిపోయింది!

ప్రేమించే హృదయం కోసం ఎన్నిరాత్రులు పిచ్చిదానిలా విలపించింది! లోకంలో అందరికీ డబ్బు కావాలి, అందం కావాలి! కాని మనసు అక్కర్లేదు! ప్రేమ అక్కర్లేదు!

తాను కోరుకున్న మనిషి కోసం ప్రతి వ్యక్తిలోనూ వెదికింది. తనకు కావాల్సిన ప్రేమ కోసం ప్రతిచోటా చూసింది. ఇన్నాళ్ల తన

## ప్రేమిస్తే ఏమౌతుంది?

[28 వ పేజీ తరువాయి]

అన్వేషణ ఫలించినట్లుగా రవి కన్పించాడు. తనకు కావాల్సిన లక్షణాలన్నీ అతడిలో వున్నాయి.

ఆ రోజు —

అతడు పరిచయమైన రోజు ఎంత సంతోషించింది! ఎంత పొంగిపోయింది! రవి తను కోరుకున్న ప్రేమభిక్ష పెట్టాడు. కాని ... కాని ఇవాళ చేదు నిజం తెలిసింది. తను పొందింది అమృతం కాదు విషం! తనకు లభించింది ప్రేమకాదు వంచన! "రవి! ఎందుకింత మోసం చేశావ్. నీ అందమైన నవ్వు వెనకాల ఇంత క్రూరత్వం వుందా?"

అట్లాగే తల్చుకుంటూ ఏడుస్తూ నిద్రలోకి జారుకుంది స్వాతి!

* * *

మర్నాడు కూడా కాలేజీకి వెళ్లబుద్ధికాక సెలవు పెట్టేంది స్వాతి. సాయంత్రం వరకూ మంచంమీద పడుకుని దొర్లుతూ, ఆలోచిస్తూ గడిపింది.

సాయంత్రం అయిదింటికి స్నానం చేసి తన గదిలో కూర్చుంది స్వాతి. చేతిలో బసవరాజు అప్పారావుగారి గేయాల పుస్తకం వుంది. పేజీలు తిరగేస్తున్నదల్లా హఠాత్తుగా ఒక గేయం దగ్గర ఆగిపోయింది.

కళ్ళూ, మనసూ ఏకాగ్రమయ్యాయి. అక్షరాల వెంట పరుగుతీశాయి.

ఎదమెత్తనౌటకై
పొదమందరా, అంత
మదిగల అహమెల్ల
వదలి పోవునురా!

ఎంత చక్కటి భావం! నిజంగా కవి అనుభూతిని పొంది చెప్పివుంటాడు.

వలపెరుంగక బ్రతికి
కులికి మురిసే కంటె,
వలచి విఫలమ్మొంది
విలపింప మేలురా!

తను వలచింది! విఫలం చెందింది! విలపిస్తోంది! ఇలా విఫలమైన ప్రేమకోసం ఏడ్చే కంటే, అసలు తను ప్రేమించకుండా వుంటేనే బాగుండేది.

చెలివలపు లేని నీ
కలిమి కాల్పనె! వినుము
వలపు తీగనె జీవ
ఫలము కాయునురా!

లోకంలో ప్రేమలన్నీ ధనంతోనే ముడిపడి వున్నాయి.

ప్రేమకంటె ఎక్కు
వేముందిరా, ఎల్ల
కామ్య పదవులకన్న
ప్రేమే ఎక్కువరా!

అన్నిటికంటె స్వార్థం ఎక్కువ. తనలోని మోహానికి ప్రేమనే ముసుగేసుకుని స్వార్థ బుద్ధితో



# ప్రకటనల ప్రహసనం!

టికెట్ లేకుండా
ఆర్టీసీ బస్సుల్లో
ప్రయాణం చెయ్య
కూడదని ఆ మధ్య
సదరు మారాజులు
వివిధ్భారతి వాణిజ్య
ప్రసారవిభాగంలో
కొన్నాళ్ళ ఆంగ్లో ఇండ్యన్
యాసలో ప్రకటనల్ని
చేస్తుండేవాళ్ళ
ఇంగ్లీషైతే గ్రామీణాం
ధ్రులందరికీ భయంగా
ఉంటుందని ఆర్టీసీ
యజమాన్లు ఆట్లా చే
సుంటారని కొందరైనా
అనుకోకపోతారా ?
అన్నది వాళ్ళ ధైర్యం కాబోలు !

ఈమధ్య ప్రజాసేవయే
లక్ష్యంగా గల ఆర్టీసీ
ప్రజాధనం సద్వినియోగం
చేస్తూ మళ్ళీ ప్రకటనల్ని
చెయ్యసాగారు
ఈసారి టిక్కెట్ రేటు పెంచా
లన్న సదుద్దేశంతో
చేశారీ మంచి ఏర్పాటు !

* * *

ప్రకటనల్ని చెయ్యడం
మంత్రులకే జన్మహక్కు
కుల విద్యయేమీ కాదు
సమాచార పౌర (సం) బంధ
శాఖవాళ్ళా మధ్య
పుష్కరాల్లో ఇప్పుడు
24 సం॥ల ఆంధ్ర
ప్రదేశ్ రజతోత్సవాల్లో
భలేగా చేస్తూంటారు !
రేడియోలో పాటకీ
పాటకీ మధ్య ఇందిరమ్మ
20 సూత్రాలకీ
సంజయ్ 5 సూత్రాలకీ
ముడిపెట్టి, ఆంధ్ర
ప్రదేశ్ రజతోత్సవాలు
ఇరవై ఐదు రోజులు
చెయ్యమని చేస్తున్న
ప్రకటనల్ని వినలేదా ?
ఇది కేంద్రానికి
రాష్ట్రం పెట్టే నివాళి
బాగుంది బహుబాగుందం
టూ అట్లాగే చేద్దాం
అని బయటికి "పిల్లా
జెల్లా" సహా వెళితే
ఎదురొచ్చినవేమిటన్నా
అంటే పస్నుల నిరాకరణ
వూరేగింపుల
ఝుంఝూమారుతం !

దీపావళి మర్నాటినుంచి
దీపావళీ కానుకగా
మ్యునిసిపాలిటీ స్టాఫ్
ఇచ్చిన సమ్మె కార్క
ఫలితంగా రాష్ట్రంలో
చెత్తా చెదారాల
కుప్పలు ఎక్కడవక్కడ
పేరుకుపోయి
పబ్లిక్ పాయిఖానాలై
ముక్కున గుద్దినట్లు
వస్తున్న దుర్గంధం !

ఎందుకొచ్చిన తంటా
సర్కారువారు చేసే
సంభావనా సంబరాల
కధలు, పత్రికల్లోనో
ఏలినవారు వేయించే
మజా మజా ప్రకటన్ల
లోనో చదువు
కుంచాముని తిరుగు
ముఖం పట్టాడు సామాన్యుడు
ఉత్సవాలకేం కొదవ

## సామాన్యుని సణుగుడు

దిన వార కర్మల పేరిట
కూడా వీటిని చెయ్యొచ్చు
వివిధ్ భారతిలో
ట్రింగ్ ట్రింగ్ ప్రకటనల్ని
అడపా తడపా వెయొచ్చు

ఇవి కొన్ని వ్యంగ్య
చిత్రాల కన్నా బాగా
నవ్విస్తాయి సామాన్యుడి
పొట్ట చెక్కలు చేస్తాయి
మచ్చుకు ఒకటి :
"ఇద్దరో ముగ్గురో
ఆహా... ఇదరో ముగురో
కావాలంటే కుటుంబం
సుఖంగా వర్ధిల్లాలంటే
మీరూ నిరోధ్ వాడండి
నిరోధ్ వాడండి"

అంటూ సన్నాయి నొక్కులు
నొక్కే ప్రకటన ఉందే
అదండీ అసలైన ప్రకటన!

ఒక నిరోధ్‌కి
ఇదరో ముగ్గురో
పుడుతూవుంటే ...
ఇంకేముందండీ మన
పని అంతే సంగతులు !

* * *

బస్సులమీద రైళ్లల్లో
మరో ప్రకటన చూద్దాం
"అంటరానితనం నేరం"
అని అంతేసి అక్షరాల్లో
ఉంటుం దక్కడక్కడ !
ఇది ఘోరం ! "అంటరాని
తనం పాటించకండంటూ
రాజ్యాంగం ఘోష
పెడుతూవుంటే అదేదో
దొంగతనం లాగ
అంటరానితనం నేరం
అంటారేమిటో
గవర్నమెంట్ వాళ్ళ
వాళ్లకే తెలియాలి
వాళ్ల ప్రకటన్ల సారం !"
ఎందుకొచ్చిన
ప్రకటనల్ని స్వామీ
సామాన్యుడి దుంప
తెంపడానికి తప్ప !

— వీ రా జీ

ఎదుటి వ్యక్తిని నిలువునా మోసం చేస్తున్నాడు మనిషి

ప్రేమించు సుఖముకై !
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
ఏమింక వలెనురా !

నిజమైన ప్రేమకు ఈ లోకంలో తావే లేదు ! ఇలా కావ్యాల్లో మాత్రమే మిగిలివుంది గేయంలో లీనమైన స్వాతి హృదయం మెత్తని అడుగుల చప్పుడు వినిపించగానే ఒక్కసారి ఝల్లుమంది !

అవి తనకెంతో పరిచయమైన అడుగులు. అవి రవివి !

కానీ స్వాతి తన గదిలోంచి బయటికి రాలేదు ! కుర్చీలోంచి లేవలేదు !

"అమ్మా స్వాతీ! రవి వచ్చాడమ్మా!" నాన్నగారు పిలుస్తున్నారు. తండ్రి ఎదుట తేలికపడటం ఇష్టంలేక పుస్తకం పక్కన పెట్టి లేచి బయటి కొచ్చింది.

రవి గదిలోకి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. తన వెనకాలే వచ్చిన స్వాతి ముఖంలోకి చూశాడు. ఆ ముఖం అప్రసన్నంగా వుంది !

"స్వాతి ! అలా వున్నావే ?" అన్నాడు స్వాతి వేపు చూస్తూ

స్వాతి కళ్ళు వర్షించబోయే మేఘాల్లా వున్నాయి. టేబిల్‌మీద వున్న స్వాతి చేతిని అందుకో బోయాడు. స్వాతి చటుక్కున చెయ్యి వెనక్కు లాక్కుంది ! రవి నొచ్చుకున్నాడు.

"స్వాతీ ! నేనేదైనా తప్పుచేస్తే శిక్షించండి !"

స్వాతి పెదాలు బిగపట్టింది.

"స్వాతీ ! మిమ్మల్ని చూడాలనీ, మీ మాటలు వినాలనీ, మీ చిరునవ్వు చూసి తరించాలని అంత దూరం నుంచి వచ్చాను. అటువంటప్పుడు నన్నిలా బాధపెట్టడం న్యాయమా ! స్వాతీ ! ఒక విషయం చెప్పనా ! ఈమధ్య ఆఫీసులో అస్సలు పని చేయలేకుండా వున్నాను. ఏ కాగితం తీసినా మీరే కన్పిస్తున్నారు ! రాత్రిపూట నిద్దట్లో మీ పేరు కలవరిస్తానేమోనని ఎంత భయంగా వుందో తెలుసా ! స్వాతీ ప్లీజ్ ! మాట్లాడండి !"

మేఘాలు వర్షించాయి !

"రవీ" అంటూ రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుంది స్వాతి.

రవి కుర్చీలోంచి లేచి స్వాతి చేతుల్ని తొలగించి కన్నీటిని తుడిచాడు.

రవి కళ్ళల్లోకి చూస్తూ — "రవీ ! నన్నెందు కిలా బాధపెడ్తారు ?" అంది బేలగా

# ప్రేమిస్తే ఏమౌతుంది?

రవి స్వాతి ముఖం పైకెత్తి, పళ్లమధ్య నలిగి కరుపురంగుని పులుముకున్న స్వాతి పెదవులపై గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు.

స్వాతి చటుక్కున తలొంచుకుని రెండు చేతుల్తోనూ ముఖం కప్పుకుంది. రవి తిరిగి కుర్చీలో కూర్చున్నాడు.

"స్వాతీ! సరిగ్గా కూర్చోండి! అసలు ఎందుకలా బాధపడుతున్నారు? మీ మనస్సులో ఏదైనా వుంటే ఎన్నడగండి."

స్వాతి ఆ ప్రార్థనకు కరిగిపోయింది. ముఖం కొంగుతో తుడుచుకుని సరిగ్గా కూర్చుంది.

"మీరు దేన్నిగూర్చి బాధపడుతున్నారో చెప్పనా?"

"..............."

"రాధని గూర్చి ఆలోచిస్తున్నారు కదూ!"

ఈసారీ మాట్లాడలేదు స్వాతి.

"స్వాతీ! మీ అనుమానం నాకు తెలుసు! నేను మిమ్మల్ని మోసం చేసి రాధని చేసుకుంటానని కదూ! స్వాతీ! మీ కళ్లకు నేనంత మోసగాడిగా కన్పిస్తున్నానా! రాధంటే అభిమానముంది! గౌరవముంది! మీరు కన్పించకపోతే రాధనే చేసుకునేవాడినేమో! అది వేరే విషయం! నేను రాధని ప్రేమించలేదు. నాకు ప్రేమ కావాలి! నా మనస్సుకు తృప్తి కావాలి! అవి ఇచ్చే వ్యక్తికోసం వెదికాను. నా తపస్సు ఫలించి మీరు లభించారు. స్వాతీ! ఇదివరకోసారి చెప్పాను. మళ్లీ చెప్తున్నాను! మీ ప్రేమ లభించని రోజున ఈ కాస్త గుండె ఆగిపోతుంది. అదే మీ కిష్టమైతే ..."

స్వాతి చటుక్కున అందుకుని – "రవీ! అలా మాట్లాడకండి! ఏదో బాధలోవుండి ..." అని తలొంచుకుంది.

"అదే వద్దన్నాను. ఎందుకు బాధపడాలి! మీరలా బాధపడుతూంటే నేనెంత కుమిలిపోతానో తెలుసా! ఇంకెప్పుడూ అలా వుండకండి! తెలిసిందా!"

స్వాతి బుద్ధిమంతురాలిలా తలూపింది.

"ఊఁ! ఇక ఇప్పుడు మాట్లాడండి!" అని కుర్చీలో వెనక్కి వాలాడు.

"ఏం! మాట్లాడను?"

"ఏదన్నా సరే! మీ నోటినుండి ఏం వచ్చినా బాగుంటుంది. పోనీ కాస్సేపు నన్ను తిట్టండి!"

స్వాతి ఫక్కున నవ్వింది.

"అమ్మయ్య! ఎలాగైతేనేం దేవిగారు నవ్వారు."

"రవీ! మీకింత బాగా మాట్లాడ్డం ఎవరు నేర్పారు?" స్వాతి సీరియస్‌గా ప్రశ్నించింది.

ఆ మాటకి పకపకా నవ్వాడు రవి.

"ఇంకెవరు నేర్పుతారు. మీరే! మీ ముఖం చూస్తుంటే మాటలు అలా వచ్చేస్తుంటాయి" అంటూ ఆమె ముఖంలోకి కొంటెగా చూశాడు.

"అలాగేం!" అని మూతి బిగించింది.

"అదిగో మళ్లీ! నవ్వుతూ వుండమని చెప్పలా!"

"చిత్తం! దొరగారి ఆజ్ఞ."

వాతావరణం తేలికయింది. పది నిముషాలు కూర్చుని లేచాడు రవి "వస్తానూ" అంటూ.

స్వాతి నవ్వుతూ 'అలాగే' అంది.

రవి స్వాతివేపు చూస్తూ – "స్వాతీ! మీ పెదవులు పిలుస్తున్నాయి రానా!" అన్నాడు కొంటెగా.

స్వాతి బుగ్గలు ఎర్రబడ్డాయి. "ఛీ! పో!" అంటూ ముఖాన్ని చేతుల్తో కప్పుకుంది.

"పోనీలే! రేపు వడ్డీతో సహా తీసుకుంటాను. బై! బై!" అంటూ వెళ్లిపోయాడు.

స్వాతి పెదవులపై వేలితో రాసుకుంది. రవి గెడ్డం గుచ్చుకుని పెదవులు ఇంకా మండుతూ వున్నాయి.

రవికి ఎంత ధైర్యం! ఎంత చొరవగా హఠాత్తుగా వచ్చి ముద్దు పెట్టుకున్నాడు. తలచుకున్న కొద్దీ మనసు పరవశించిపోతోంది. అయినా మగాడిలో ఆ మాత్రం చొరవ, ధైర్యం లేకపోతే ఏం బాగుంటుంది!?

అతడు మోసగాడు కానీ, రౌడీకానీ అతడిని తను వదులుకోలేదు. వదిలి జీవించలేదు. అతని తియ్యని మాటలు వినకుండా క్షణం వుండలేదు. అతడి చిరునవ్వునీ, ఆ కళ్లల్లోని మెరుపునీ, అన్నిటికీ మించిన అతని తియ్యటి ముద్దునీ వదులుకోలేదు. వదిలి జీవించలేదు!...

* * *

ప్రేమ గుడ్డిది అన్నారు. అది నూటికి నూరుపాళ్లా నిజం!

ప్రేమకోసం ఏడ్చినవాళ్లున్నారు!

బాధపడ్డవాళ్లున్నారు!

త్యాగం చేసినవాళ్లున్నారు!

ఆత్మహత్యలు చేసుకున్నవాళ్లున్నారు!

ప్రేమలో సుఖంకన్నా దుఃఖమే ఎక్కువగా వుంటుందంటారు. అది నిజమే! ప్రేమ ఎంత తియ్యగా వున్నా ప్రేమికులకు నిరంతరం బాధా, ఆవేదనే మిగిలింది! ఎందుకనీ? సంఘము, పరిస్థితులవల్లనా! స్వాతి ఒళ్లో పుస్తకం పెట్టుకుని వెనక్కి వాలి ఆలోచిస్తోంది. రవి రెండు రోజులయింది వచ్చి.

ఎందుకు రాలేదో! మనసంతా ఏదో దిగులుగా వుంది. ఏదో పోగొట్టుకున్నంత శూన్యం! చికాకు!

ఏ పనీ చెయ్యబుద్ధి కాదు! అన్నం తినాలన్పించదు! నిద్రపట్టదు!

రవి కోసం తనెందుకు బాధపడాలి!

రెండు నెలల క్రితం అతని ముక్కూ ముఖం తనెరగదు.

ఈ రెండు నెలల్లోనే ఇంతటి అనుబంధం ఎలా ఏర్పడింది!

ఇదేనా ప్రేమంటే!

అయితే రవి కూడా ఇటువంటి బాధనే అనుభవిస్తుండాలి!

ఇక్కడకు వచ్చినప్పుడు మాత్రం ఎంత తియ్యని మాటలు చెప్తాడు.

అవన్నీ పై పై మాటలేనా!

మనసులోంచి వచ్చినవి కావా?

ఆలోచనల్తో తల బరువెక్కింది. ఈ రోజు కాలేజీలో పాఠాలు కూడా సరిగ్గా చెప్పలేకపోయింది! రేపూ చెప్పలేదేమో! ఎందుకిలా అవుతోంది!

తన మనస్సు తనకే అర్థం కావటంలేదు.

చీకటి అలుముకుంటోంది!

రవి ఈ రోజు కూడా రాలేదు! రేపూ రాడా! ఇక ఎప్పటికీ రాడేమో! గుండె బరువెక్కింది! ఎందుకో దుఃఖం గుండెల్లోంచి పొంగుకు వస్తోంది.

ఏమిటింత బేల అయిపోతోంది తను! కుర్చీలో కూర్చోలేకపోయింది. లేచి అటూ, ఇటూ తిరగసాగింది.

(ఇంకా ఉంది)

'సంధ్య'లో ఒక సన్నివేశం



అత్యధిక ప్రచారం కలిగిన తెలుగు సినీ వారపత్రిక

వారం వారం
మిమ్మల్ని
తారాలోకంలో
విహరింపజేసే
మధుర స్వప్నం



జ్యోతిచిత్ర

వర్ణ చిత్రాలతో,
ఆఫ్‌సెట్ ముద్రణతో
85 పైసలకే వెలువడుతున్న
20 పేజీల సినీ వారపత్రిక

madhav

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

జి. ఏ. ఆర్. — విశాఖపట్నం

మీ నవలలు చాలా చదివానండి. అసలు వర్ణనలకి ప్రాధాన్యం యివ్వరు. వర్ణించడం రాకనా? వర్ణనలు అంటే మీకు ఒళ్లు మంటా?

★ చేతకాకనే సార్, లేకపోతే ఏ అద్దం ముందో హీరోయిన్‌ని కూర్చోపెట్టి అలంకరింపు కోడం ఓ ఆరు పేజీలు లాగించేయనా!!

జి. కె. ఆర్. — వినుకొండ

మనసున్నవాడే మహాకవి. మీరేమంటారు. నా మనసు తెలుసుకుంటారా?

★ నేనేం మహాకవినా — మనస్సులు కొలిచి పేగులు పీకి జండా కొయ్యకి తగల్బండి అంటూ కవిత్వం చెప్పడానికి.

ప్రవీణ్‌కుమార్ — వెల్లులా (మెట్‌పల్లి తాలూకా)

రామలక్ష్మిగారూ! ఒకే భర్తతో సంసారం చేసిన స్త్రీని పతివ్రత అంటారు. ఒకే భార్యతో సంసారం చేసే మగవాడిని ఏమంటారు?

★ ఏకపత్నీవ్రతుడంటున్నారు.

జి. ఎస్. ఎస్. — మద్రాసు

తాము ఆచరించలేని నీతులు ఎదుటివారికి ఎంతో శాంతంగా బోధిస్తారు. అలాంటి మనస్తత్వం కలవారిని ఏమని భావించాలి?

★ బోధకులెప్పుడూ కాస్త కూస్త... సామాన్యులకంటే అతీతులు కదా. 'నే చెప్పేట్టు విను. చేసేట్టు చేయకు' అని కదా సామెత?

కె. ఎల్. ఎస్. — ఎమ్మిగనూరు

ద్వేషము, స్వార్థము మనిషికి సహజమా?

★ అనే అనుకోవాలి.

ఎం. బి. ఆర్. — బైపల్లి

మన సినిమా పాటలలోని సాహిత్యం విన్నప్పుడు మీకు ఏమనిపిస్తుంది!

★ అరె! మన ఇంటిపక్క అప్పన్నా అప్పలమ్మ తిట్టుకుంటున్నప్పుడో, సరసాలాడు కుంటున్నప్పుడో కాస్త టేపు చేసి ఏ చక్రవర్తికో యిచ్చి వుండకూడదా? యీసరికి నా పాట జనం నోట నానేది కదా అనిపిస్తుంది.

విజేంద్ర — ఆదోని

మనిషికి ఎక్కువ మత్తునిచ్చేది ఏది? మగువా? మధువా లేక ధనమా?

★ ఇవేవీ కాదు. అధికారం.

అప్పులు పంచుకొనేటట్లు బాధలు కూడా పంచుకొనే విధంగా ఆ దేవుడు చేసివుంటే ఎంత బాగుండును.

★ ఆస్తులు దాయాదులు, అప్పులు కన్న సంతతి, బాధలు స్నేహితులూ పంచుకుంటారు. ఇది మనవాళ్ల రాతేగాని దేవుడి చేతకాదు.

వీర్ — సామర్లకోట

జీవితం అంటే కూర్చుని సినిమా చూడ్డానికి, సినిమా కాదు. పడుకుని చదవడానికి నవలా కాదు. ఇది తెల్సుకుంటే చాలు మీ ఆడవారు. సంసారాలు సరిగా దిద్దుకొనకలరు.

★ అలాగా! విశ్రాంతిగా సినిమా చూడ్డానికి, కూర్చుని పట్టుమని పది పేజీలు చదవడానికి ఆడవాళ్లకి సమయం వుంటే — అదే పదివేలు. మీరు వూహించుకుని విమర్శించేముందు — ఆడదాని పనిపాటలకు శ్రమకి విలువ కట్టి చూడడానికి ప్రయత్నించండి. గృహిణి సేవకి విలువ యివ్వుకో లేదు ఏ గృహస్తూ!

ఎ. వి. ఆర్. — విజయవాడ

సంతోషానికి నిర్వచనం ఏమిటి కె. రా. గారూ?

★ సంతోషం అంటే వేరేం కాదు రావుగారూ— మంచి ఆరోగ్యమూ, శక్తివంతమైన జ్ఞాపక శక్తీను.

ఎస్. ఏ. ఎస్. — కామారెడ్డి.

స్త్రీలకు ప్రాణం కంటే మానం ఎక్కువ అన్నారు. మరి ఈనాడు దాన్నే నడిబజారులో అమ్ముతున్నారు. మీరేమంటారు?

★ కర్ణుడి చావుకి కారణాలు వెతకడం లాగే ఇదీను — దీనికి కారణం ఒకటి కాదు చాలా చాలా వున్నాయి. వాటిలో మొదటిది — డబ్బు దాహం.

కె. ఎస్. కె. — నూజివీడు.

విద్య, ధనం, కీర్తి, పరిజనం ఎంత వున్నా మరణ కాలమందు రక్షింపవు. భక్తియే రక్షించును అని ఒక దేవాలయంపై రాసివుంది. అంటే భక్తి వున్నవారికి మరణం సంభవించదనా?

★ రక్షణ మరణం నుంచి కాదు; నరకంలో పడిపోకుండానని!



# చతుర్దశ రత్నాలు




"రత్నహారీ తు పార్థివః" అనే ఆర్యోక్తి ఉన్నది. రత్నాలు లక్షల కొలది రూపాయిలు విలువ కలవి. వాటిని రాజులు సంపాదించుకుని ఉంచేవారు. ఆ రత్నాలు వజ్ర, వైఢూర్యాదులు తొమ్మిది అని ప్రసిద్ధి.

రత్న శబ్దం వల్ల విలువైన రాళ్ళే కాదు, ఏ విషయంలోనయినా అత్యుత్తమంగా ఉండే వన్నీ తెలుపబడు తున్నవి. స్త్రీ రత్నం, అశ్వరత్నం మొదలైన పదాలు సుప్రసిద్ధంగా ఉన్నవి. ఏ విషయం ఏవి ఉత్తమాలో వాటిని రాజులు సంపాదించేవారు. విక్రమాదిత్యుని ఆస్థానంలో ఉండిన విద్వాంసులు, మహాకవులు నవరత్నాలుగా పేరు పొందారు.

ప్రాచీన గ్రంథాలు కొన్నింటిలో అష్ట రత్నాలు చెప్పబడి వున్నవి. అవి రాజులకు ముఖ్యాలని తెల్పబడింది. లలిత విస్తరాది గ్రంథాల్లో ఈ విషయం ఉన్నది.

క్రమంగా ఈ రత్నాలు పద్నాలుగు సంఖ్యకు పెరిగినట్లు ధర్మ సంహిత మున్నగు గ్రంథాలను బట్టి తెలుస్తున్నది. ఈ పద్నాలుగు రత్నాలు చక్రవర్తి దగ్గర ఉండవలసిన వట!

వాటిని గురించి ఈ శ్లోకాలు వివరంగా చెపుతూ ఉన్నవి—

"చక్రం రథో మణిః ఖడ్గః
చర్మ రత్నం చ పంచమమ్,
కేతు ర్నిధిశ్చ సప్తైవ
ప్రాణహీనాని చక్షతే.
భార్యా పురోహిత శ్చైవ
సేనానీ రథకృచ్చ యః
పత్త్యశ్వ కలభా శ్చేతి
ప్రాణినః సప్త కీర్తితాః,
చతుర్దశేతి రత్నాని
సర్వే షాం చక్ర వర్తినామ్"

"రత్నాలు పద్నాలుగు. ఇవి చక్రవర్తు లందరి దగ్గర తప్పక ఉండవలసినవి. వీనిలో ఏడు ప్రాణంలేని రత్నాలు. అవి— చక్రం, రథం, మణి, ఖడ్గము, డాలు, కేతువు, నిధి అనేవి. మరి యేడు ప్రాణం ఉన్నవి. అవి— భార్య, పురోహితుడు (హితం కోరే గురువు) సేనాధిపతి, రథం నడిపేవాడు, పదాతి, మేలైన అశ్వము, అట్టి యేనుగున్నూ" అని యీ మీది శ్లోకాల అభిప్రాయం. పూర్వ కాలంలో ప్రభువులు మేలైన వీటిని రత్నాలుగా భావించేవారు.




# ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారి
# ఇంటింటా స్వంత గ్రంథాలయం ప్రణాళిక

























నువ్వు కట్టేదేమో 120 రూ.లు మాత్రమే! అదీ 12 తేలిక వాయిదాలలో!

| నీకు వచ్చేది | కలిసి వచ్చేది |
|---|---|
| నువ్వు కట్టే 120 రూ.లకు | |
| 130 రూ.ల పుస్తకాలు | రూ. 10·00 |
| 8 ఉచిత పుస్తకాలు | 28·00 |
| పెద్ద కేటలాగు | 2·00 |
| ఉచిత తపాలా సౌకర్యం | 15·00 |
| | రూ. 55·00 |








# 15-12-'80 లోపు చందాదారులుగా చేరినవారికి ప్రత్యేక సదుపాయం!

మొదటి నెల వచ్చే ఉచిత పుస్తకాల (వెల రూ.7) బదులు ఈ దిగువ ఇచ్చిన 5 ఛాయిస్‌లలో ఒకటి ఎన్నుకొని సుమారు 8 రూ.ల అదనపు లాభం పొందవచ్చు. ఈ సదుపాయం 15-12-'80 లోపు చందాదారులుగా చేరిన వారికి మాత్రమే! ఆ తర్వాత చేరినవారికి కేవలం 2 ఎమెస్కో పాకెట్ బుక్స్ (7 రూ.ల విలువగలిగినవి) మాత్రమే ఉచితంగా వస్తాయి. లేదా 15-12-'80 తర్వాత చేరినవారు వీటిలోనుంచి ఎన్నుకోదలిస్తే మొదటి నెల చందాగా రూ. 15/-లు పంపాల్సి వుంటుంది.



| ఛాయిస్ నెంబర్ | | మొదటి ఉచిత పుస్తకాల జాబితా! | |
|---|---|---|---|
| 1 | | నీరాజనం - యద్దనపూడి సులోచనారాణి | రూ. 15.00 |
| 2 | I | పసుపుతాడు - ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి | 12.00 |
| | II | ఎమెస్కో పాకెట్ తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరీ - బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు | 4.00 |
| 3 | I | బొమ్మరిల్లు - వాసిరెడ్డి సీతాదేవి | 9.00 |
| | II | భాగవతం - పోలంకి వెంకట రామచంద్రమూర్తి | 6.00 |
| 4 | I | ఎమెస్కో బొమ్మల పంచతంత్రం - పోలంకి వెంకట రామచంద్రమూర్తి | 10.00 |
| | II | నారీ సేవర్ బ్రహ్మచారి - డా॥ కొర్రపాటి గంగాధరరావు | 5.00 |
| 5 | I | రాజీ - 'నీరా' | 11.00 |
| | II | చరిత్రకెక్కిన చరితార్థులు - చల్లా రాధాకృష్ణశర్మ | 4.00 |















## మరో సదుపాయం!

15-12-'80 లోపు చందాదారులుగా చేరిన వారి నంబర్లన్నిటినీ లాటరీలో వేసి డ్రా తీస్తాము. డ్రాలో వచ్చిన మొదటి 10 నంబర్ల చందాదార్లు మిగతా చందా 110/-రూ.లు కట్టకుండానే వారికి మొత్తం పుస్తకాలు పంపిస్తాము.

డ్రా వివరాలు HLP న్యూస్ లెటర్ ద్వారా తెలియపరుస్తాము

## చందాదారులుగా చేరే విధానం......

మొదటి నెల చందా రూ.10/- M.O. చేస్తూ పక్కన ఇచ్చిన కూపనులో గాని, పోస్టుకార్డు మీద గాని, M.O. కూపను మీద గాని మీకు కావలసిన పుస్తకాల ఛాయిస్ నంబరును గుర్తించి క్రింది చిరునామాకు పంపండి!

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
3237, రాష్ట్రపతి రోడ్,
సికింద్రాబాద్
500 003

ఎ.పి.బి.డి. వారికి —
అయ్యా - మీరు నిర్వహిస్తున్న 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికలో నన్నొక చందాదారునిగా చేర్చుకోవలసిందిగా కోరుతున్నాను. పథకం తాలూకు నిబంధనలకి బద్ధుడనై వుంటాను. మొదటి నెల చందా 10/- రూ.లు M.O. గా పంపిస్తున్నాను.
రసీదు నెం: .............. తేదీ ..............
మొదటి ఉచిత పుస్తకాలకి గాను (✓) గుర్తించిన ఛాయిస్ నెంబర్‌లోని పుస్తకాలు పంపండి

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|

పేరు:

చిరునామా:

రోజూ వుదయం ఐదు గంటలకే నిద్రలేచే చలమయ్యగారు ఆ రోజు ఆరు దాటినా తన గది నుండి బయటికి రాకపోయేసరికి, సావిత్రమ్మ ఆ గదిలోకెళ్ళి చూస్తే చలమయ్యగారు మంచంమీద కూచుని, కళ్ళు మూసుకుని జోగుతున్నారు.

"అదేంటండీ! ఆరు దాటింది. ఈ రోజు 'మార్నింగ్ వాక్' వెళ్ళరా? ఏమిటి! వచ్చి ముఖం కడుక్కోండి. కాఫీ యిస్తాను" అంటూ సావిత్రమ్మ [illegible]గుమ్మలా గదిమేసరికి, చలమయ్యగారు అప్పుడే తపస్సులోంచి లేచిన ఋషిపుంగవుడిలా కళ్ళు తెరిచాడు.

"యాజులుగారింకా రాలేదేమిటే! ఆయనొస్తారనే యిందాకట్నుంచి కాచుక్కూచున్నాను. స్నానం చేస్తాగాని, కాఫీలో మాత్రం పంచదార తక్కువేయకు" అంటూ మంచం నుండి లేచి పెరట్లోకెళ్ళారు చలమయ్యగారు. యాజులుగారు తోడు లేందే 'మార్నింగ్ వాక్' వెళ్ళలేక పోయారు ఆ రోజు.

సోమయాజులు, చలమయ్యగార్లు చిన్నప్పటి నుండి స్నేహితులు. సమాన వయస్కులు. ఒకే వూళ్ళో ఉద్యోగం చేశారు. రెండు సంవత్సరాల తేడాలో వుద్యోగ విరమణ కూడా చేశారు. యాజులుగారు కమర్షియల్ టాక్స్ ఆఫీసరుగాను, చలమయ్యగారు పోలీసు ఇనస్పెక్టరుగాను పని చేశారు. అంటే ఆర్థికంగా యిద్దరూ సమానులే! యాజులుగార్కి యిద్దరమ్మాయిలు. పెళ్ళిళ్ళు చేసి పంపేశాడు. చలమయ్యగార్కి ఇద్దరు కొడుకులూను పెద్ద వుద్యోగాల్లో, వేరే రాష్ట్రాల్లో వున్నారు.

చలమయ్య, యాజులగార్ల కార్యక్రమం ఉదయం 'మార్నింగ్ వాక్' తో మొదలవుతుంది. సాయంకాలం పార్కుకు వెళతారు. ఏ సిమెంట్ బెంచీమీదో కూచొని లోకాభిరామాయణం మొదలెడతారు. ఉదయాన యాజులుగారు చలమయ్య గారింటికెళ్తే, సాయంకాలం చలమయ్యగారు యాజులు గారింటికి వెళ్తారు. మధ్యలో ఎప్పుడైనా లైబ్రరీకో, సినిమాకో వెళ్ళడం కూడ కద్దు.

ఆరోజు చలమయ్యగారి మనసులో చెప్పలేనంత వెలితి వుంది. మనసు బాగాలేదు. స్నానం చేస్తున్నప్పుడు, టిఫిన్ తింటున్నప్పుడు కూడ యాజులు గుర్తుకొచ్చారు. యాజులు యీ రోజువరకు వేళ తప్పలేదు.




ఒంట్లో బాగాలేదో? ఆ మాట అను కుంటూనే చలమయ్యగారికి భయమేసింది. కంగారుగా సోమయాజులుగారిల్లు చేరుకున్నాడు అంతవరకు చాల బాధపడిపోయాడు మానసికంగా.

"అన్నయ్యగారూ? పెద్దమ్మాయికి ఏదో నలతగా వుందని అల్లుడుగారు రాత్రి ట్రంకాల్ చేశారు. వీరు రాత్రికి రాత్రే బయల్దేరి వెళ్లారు. ఈరోజు సాయంకాలాని కల్లా వచ్చేస్తానన్నారు" అంటూ విశాలక్షమ్మ గారు చెప్తుంటే చలమయ్యగారి గుండెలు కుదుట పడ్డాయి.

ఇందాక అనవసరంగా భయపడ్డ దానికి చలమయ్యగారు నవ్వుకున్నారు. వయస్సు అలాంటిది. ఏ నిముషంలో ఏమవుతుందో చెప్పలేరు. విశాలక్ష్మమ్మగారిచ్చిన కాఫీ తాగేసి, శెలవు పుచ్చుకుని యిల్లు చేరుకున్నాడు చలమయ్య.

వస్తూనే వాలుకుర్చీని ముంగిట్లో వేసుకుని కూచున్నారు. వీధిలో వెళ్లే జనం, పోయేజనం అంతా కనపడుతుందిఅక్కణ్ణించి. చలమయ్యగారు కుడివైపుగా చూశారు.

అక్కడ 'సుందర్ టైప్ రైటింగ్ ఇనిస్టిట్యూట్' వుంది. ఒక పదేళ్ళ క్రితం సుందరయ్య అనే టైపిష్టు, జ్యుడిషియల్ డిపార్ట్మెంట్‌లో పనిచేస్తూ, ఒక నాయర్‌తో ఏదో కేసు విషయమై లాలూచి పడ్డాడని, అందుకై వుద్యోగం నుండి బర్తరఫ్ చేయబడ్డాడు. అతడు వెంటనే 'ఇనిస్టిట్యూట్'ను రెండు టైప్ మిషన్లతో మొదలెట్టాడు. ఇప్పుడు ఓ నలభై మిషన్లు, ఓ ఐదు మంది దాకా ఇన్‌స్ట్రక్టర్లు వున్నారు. సుందరయ్య నోట్లో కారాకిల్లీ బిగించి, చుట్ట వెలిగించి దినపత్రికను ముందేసుకుని రోజంతా గడుపుతాడు. సుందరయ్య ఎక్కువ మాట్లాడడు. నవ్వుతాడు, గుర్రంలా సకిలిస్తాడు.

సుందరయ్య ఆరోజు "ఇనిస్టిట్యూట్"కు యింకా రాలేదు. పది కావొస్తోంది. వీధుల్లో జనమెక్కువవుతున్నారు. బాదంచెట్టులోంచి కాకులు తెగ అరుస్తున్నాయి. పదేళ్ల కుర్రాడొకడు కుడికాలితో మామిడి టెంకను తన్నుకుంటూ, పోతున్నాడు.

చలమయ్య ఇంటికి ఎడమవైపు ముందుకు చిన్న 'కట్టెల అడితి'వుంది. దాని యజమాని రాఘవులు. పేరుకు యజమానేకాని పెత్తనమంతా నాగమణిది. రాఘవులు అప్పుడే కాల్చిన యినుములా వుంటాడు. నాగమణి మాత్రం రాఘవుల్ని దిమ్మమీద కుదేసి సాగ తీస్తుంది మాటల్లోను, చేతల్లోను. నాగమణే రాఘవుల్ని లేపుకొనివచ్చి యిక్కడ కట్టెల అడితి, అందులోనే బొగ్గుల దుకాణం తెరిచింది. నాగమణి ఆ పెట్టుబడి ఎలా సంపాదించిందో చలమయ్యగారి పోలీసు గుండెకు తెలుసు. చలమయ్యగార్ని చూస్తే నాగమణికి భయం. హడలూను. ఇంకో అరగంట.దాటింది. సూరీడు యింకా మబ్బుల్లోనే వున్నాడు. ప్రశాంతంగా వుంది వాతావరణం. అయినా చలయమ్యగారి కెందుకో విసుగ్గాను,

పేపరు యింకా రాలేదు. వచ్చినా అందులో రాజకీయ మార్పిడులు, హత్యలు తప్ప యింకేముంటాయి. చలమయ్యగారు వాలుకుర్చీలోంచి లేచారు. ఇంట్లో కెళ్లారు. ఏదో పేపరు, పెన్సిల్ ముక్క తెచ్చుకున్నాడు. తన సర్వీసులో తనకు తెల్సిన పోలీసులు, నారి పేర్లు, నెంబర్లు రాయబోయాడు. అప్పుడప్పుడు, రిటైరైన పోలీసు ఇనస్పెక్టర్ చలమయ్యగారు తన జ్ఞాపక శక్తికి యిలా పరీక్ష పెట్టుకుంటారు. ఒక సంవత్సరం క్రింద దాకా నూటికి నూరు మార్కులు వచ్చేవి. కాని యిప్పుడు అరవైకి దాటడం లేదు. ఓ ఇరవై పేర్లు రాస్తూనే, పెన్సిల్ ముక్కు విరిగింది. సావిత్రమ్మను గట్టిగా కేకేసి బ్లేడు తెచ్చివ్వమన్నాడు. ఆమె నసుగుతూనే తెచ్చి యిచ్చింది. ఓ ఏభై పేర్లు రాశారు. వాటి కెదురుగా పోలీసు నెంబర్లు ఓ నలభై మందికే రాయగలిగారు. ఎంతో ఆలోచించిగాని యింకో పదిమంది పేర్లను మాత్రం రాయగలిగారు. బుర్ర వేడిక్కింది. రాసిన పేర్లు మళ్ళీ చదివారు. నెంబర్లు చదివారు. ఇక లాభంలేదు జ్ఞాపక శక్తి సన్నగిలిపోయిందని ఎంతో విచారించారు. ఆ పేపరుమీద ఆ రోజు తారీఖు వేశారు. దాన్ని తీసుకెళ్ళి ప్రత్యేకమైన ఫైల్లో ఉంచుకుంటారు. అప్పుడప్పుడు ఆ కాగితాన్ని చూసుకుని బేరీజు వేసుకుంటారు చలమయ్యగారు. పెన్సిల్ ముక్కను ప్రక్కన గిరాటేశారు. ఇక మిగిలింది బ్లేడుముక్క.

కాలిగోళ్ళు చూశారు. వేలి గోళ్ళు చూశారు. అవి బాగా పెరిగి వున్నాయి. ఆరోగ్య లక్షణం కాదనుకొని, ఒక్కొక్కటే బ్లేడుతో వాటిని నెమ్మదిగా తీశారు. కుప్పపోశారు. మూల పడివున్న ఎరటి ఉలిపిరి కాగితాన్ని తీశారు. అందులో గోళ్ళన్నీ పోసి, పొట్లంలా కట్టారు. ఆపైన దారంతో భద్రంగాకట్టారు. అరవై ఐదేళ్ళ చలమయ్యగారు పదేళ్ళ చలమయ్యగా మారారు. మనసు కుర్రతనంతో జోడు కలిపింది.

ఇంటి గేటుముందు నిలబడి, అటూ యిటూ చూసి, పొట్లాన్ని సరాసరి నడిరోడ్డుమీద పడేలా విసిరారు ఎవ్వరూ చూడకుండా.

వాలు కుర్చీలో కూచున్నారు. చలమయ్య గారి చూపంతా ఆ పొట్లంమీదనే వుంది.

ఇందాకటి కుర్రాడు ఈసారి ఎడంకాలితో తామిడి టెంకను తన్నుకుంటూ వస్తున్నాడు. సరిగ్గా ఆ టెంక ఆ పొట్లాందగ్గర ఆగింది. ఆ కుర్రాడి చూపు పొట్లం మీద పడింది. రెండు వైపులా చూశాడు. మెల్లగా వంగి కుడిచేత్తో టెంకను అందుకున్నట్లు, దాంతోబాటే పొట్లాన్ని కూడ అందుకున్నాడు. ఏవరన్నా చూస్తున్నారేమో న?

నాల్గు దిక్కులూ చూశాడు. ఆ కుర్రాడు దారం వూడదీశాడు. పొట్లం విప్పుతున్నాడు. కళ్ళల్లో ఏదో ఉద్వేగం. విప్పాడు. వాడి ముఖంలో పరిపూర్ణమైన వెన్నెల్లాంటినవ్వు. సన్నటి గులకరాళ్ళు ఏరి, ఆపొట్లంలో వేసి, ఎలాగుంటే అలాగే, యిందాకటి దారంతో కట్టాడు. దాన్ని అక్కడే పడేసి నవ్వుకుంటూ ఆ మామిడి టెంకను తన్నుకుంటూ వెళ్ళి పోయాడు ఆ కుర్రాడు. ఇదంతా చూస్తున్న చలమయ్యగారు వాణ్ణి మెచ్చుకున్నారు. ఎవడో సైకిలుమీద వస్తున్నాడు. సరిగ్గా ఆ పొట్లం దగ్గరే సైకిల్ చైను వూడిపోయింది. అతడు సైకిల్ దిగాడు చైను సరిచేసు కున్నాడు. సైకిలెక్కి హుషారుగా ''ఈల'' వేసుకుంటూ వెళ్ళిపోయాడు. వాడి దృష్టి ఆ పొట్లంమీద పడందానికి చలమయ్య ఎంతో విచారించాడు. కళ్ళున్న గుడ్డివెధవ అని తిట్టారు కూడాను.

సుందరయ్య కారాకిళ్ళి బిగించి చుట్టను నోట్లో పెట్టుకొని గుండ్రాయిలా దొర్లుకొస్తున్నాడు. ఆ పొట్లందగ్గర కొచ్చే సరికి, అతడిచూపు పడనే పడింది. అగ్గిపెట్టె కిందకు జారేశాడు. అగ్గిపెట్టెతో బాటు, పొట్లాన్ని చేతిలో యిరికించుకొని వడి వడిగా ఇన్‌స్టిట్యూట్ లోకి వెళ్ళిపోయాడు.

చలమయ్యగారు బాధపడిపోయారు. ఈ తమాషాతో రోజంతా సరదాగా గడపొచ్చను కున్నారు. కాని యీ కాకివెధవ, ఆ పొట్లాన్ని రొట్టెలా తన్నుకుని వెళ్ళిపోయాడని, తనే సర్వీసులో వుంటే ఏదో సెక్షను క్రింద ఆరేళ్ళు జైల్లో తోసేద్దును వెధవను, అంటూ వాపోయారు. ఇంతలో సుందరయ్య బైటికొచ్చాడు. ముఖంలో ఏదో కోపం, అవమానం. అక్కణ్ణించే ఆ పొట్లాన్ని నడి వీధిలోకి విసిరేసి లోనికెళ్ళిపోయాడు సుందరయ్య.

చలమయ్యగారిలో 'హుషారు' మళ్ళీ ప్రవహించింది. సావిత్రమ్మ తెచ్చిచ్చిన కాఫీని తాగుతూ అలానే కూర్చుండిపోయారు చలమయ్యగారు. ఇంకో అరగంట దాక పొట్లం మీద ఎవడి చూపు పడలేదు. చలమయ్యగారికి గొప్పచిరాగ్గా వుంది.

నాగమణి, యింట్లో వూడ్చిన చెత్తంతా ఒక చేటలోకి తీసుకొని, పెంటకుప్పలోకి విసిరేందుకు రోడ్డు దాటుతున్నదల్లా, ఒక్క సారిగా చేట చేతుల్లోంచి జారి చెత్తంతా రోడ్డుమీద పడింది. నాగమణి సణుక్కుంటూ ఆ చెత్తంతా తీసుకొని మళ్ళీ 'అడితి'లోకి వెళ్ళిపోయింది. చలమయ్యగారు నవ్వుకున్నారు మెల్లగా. నాగమణి చేటను రోడ్డుమీద ఎందుకు పడేసిందో, ఆ చెత్తంతా మళ్ళీ ఆ 'పొట్లం'తోసహా ఎలా సంగ్రహించిందో తెలుసుకుని ఆనందించారు.

గుర్రం సకిలించింది. సుందరం కూడా నాగమణి ఎత్తును గమనించాడు. జుత్తు పీక్కుంటూ, పొట్ట తడుముకుంటూ నవ్వేస్తున్నాడు సుందరం. సుందరం చలమయ్యగార్ని చూసే అవకాశం లేదు. ఎదురుగా పెద్ద స్తంభం వుంది.

ఉన్నట్టుండి 'కట్టెలడితి'లో భూకంపం బయలుదేరింది. ఉరుములు, మెరుపులు, తిట్లు,చీవాట్లు, బూతులు. అంటే నాగమణి 'ఆ పొట్లం'లో వున్న దేమిటో గ్రహించిందన్నమాట. నాగమణి బైటకి వచ్చి చూసే సరికి, ఎదురుగ్గా పిచ్చిగా నవ్వుతూన్న సుందరాన్ని చూసింది. కాళిలా అయింది. సుందరాన్ని పరోక్షంగా తిట్టింది. అతడి వంశాన్ని బూతులతో అలరించింది. సుందరం లోనికెళ్ళిపోయాడు, నాగమణి తిట్లవర్షాన్ని భరించలేక. ఎందుకైనా మంచిదనుకొని చలమయ్యగారు కూడా యింట్లోకి జారుకున్నారు.

అప్పటికే పన్నెండు దాటింది. ఇందాకటి మానసిక ప్రవృత్తుల్ని గమనించిన చలమయ్యగారికి భోజనం చేస్తుండగా నవ్వొచ్చి గొంతు పొరపోయింది. ఒక గ్లాసుడు మంచినీళ్ళతో గాని తగ్గలేదు.

సాయంత్రం ఆరుగంటలయింది. సావిత్రమ్మగారు ఏదో పేరంటానికి వెళుతున్నానని, రాత్రి ఎనిమిదింటి దాకా రానని, చలమయ్యగార్ని రోడ్డుమీద పడేసి, తాళం చెవుల్ని చెంగున కట్టుకుని వెళ్ళిపోయింది. పోతూ పోతూ ఇంట్లో 'గ్యాస్' అయిపోయిందని డిపోకెళ్ళి చెప్పిరామంది.

వీధిలో నిలబడేసరికి ఎంతో హాయి అన్పించింది. ఈ ఒక్కరోజూ ఎంత నరకయాతన పడ్డాడో పాపం చలమయ్యగారు. ఎప్పుడూ లేనిది, మధ్యాహ్నం భోజనం చేస్తూనే సావిత్రమ్మగారు, చలమయ్యగార్ని ఇంట్లో బూజు దులపమంది... చిందర వందరగా పడేసిన న్యూస్ పేపర్లను... చిత్తుకాగితాల్ని ...ఏవో పుస్తకాల్ని... అన్ని శుభ్రంగా సర్దమంది... సుఖ సంసారానికి ముఖ్య లక్షణం, భార్య చెప్పే ఆజ్ఞల్ని భర్త నోరెత్తకుండా శిరసావహించడమేనని, చలమయ్యగారు పెళ్ళైన ఆర్నెల్లకల్లా తెలుసుకున్నారు... ఈ రోజువరకు కూడ ఆచరిస్తూనేవున్నారు. కాని 'ఆ పొట్లం' కథా కమామిషు కొద్దిసేపు



## ప్రారబ్ధం

సరదాగా గడిచింది. ఆ సంగతంతా సోమయాజులుగార్కి చెప్పి, నవ్వించాలనుకున్నాడు చలమయ్యగారు.

చలమయ్యగారు అడుగు ముందేసే సరికి, సుందరయ్య నమస్కారం చేశాడు. అందుకున్నాడేగాని ప్రతినమస్కారం చేయలేదు. ముందుకెళ్ళిపోయాడు. గ్యాస్ కంపెనీకెళ్ళారు. గ్యాసు యింకా రాలేదని, రావటానికి యింకో వారం పట్టొచ్చని, వచ్చాక మాత్రం ముందుగా పంపుతామన్నారు. గ్యాస్ పని అయిపోయింది.

సోమయాజులుగారి అమ్మాయి కెలా వుందో? ఏమో?? సోమయాజులు వచ్చారో లేదో? అనుకుంటూనే "ఎల్లమ్మ వీధి"లోకి నడిచారు. ఇంకా లైట్లు వెలగలేదు.

ఎల్లమ్మ వీధి చివర్లో వుంది సోమయాజులు గారిల్లు. వీధంతా వర్షానికి పొడుచుకొచ్చిన కంకరతో నిండివుంది. చాల జాగ్రత్తగా నడవాలి. లేకపోతే వేళ్ళు కొట్టుకుపోతాయి. చలమయ్యగారు నిదానంగా నడుస్తున్నారు. చెప్పులకు రాళ్ళు తగిలి ముందుకు ఎగిరిపడుతున్నాయి.

ఎదురుగ్గా ఎర్రటి వురిపిరి కాగితపు పొట్లమొకటి పడి వుంది. చలమయ్యగారు ఆశ్చర్యంగా దానివైపు చూశారు. ఆపొట్లాన్ని మృదువుగా తన్నారు. ఏదో బరువున్నట్లుంది. రాళ్ళకు తగిలి ప్రక్కకు పరిగింది. ఒక అర నిముషం అన్ని వైపులా చూశాడు. ఎదురుగ్గా ఒక యింటి అరుగుముందు ఒక ముసలాయన ఏదో పేపరు చదువుకుంటున్నాడు. అతడు చలమయ్యగార్ని గమనిస్తున్నాడు కూడాను. అంటే అతడు కూడా తనలా గోళ్ళుగాని, గులకరాళ్ళుగాని వేసి పొట్లంకట్టి రోడ్డుమీద పడేసి, జనాల్ని పరీక్షించడంలేదు కదా? చలమయ్యగారికి తను వుదయం ఆడిన నాటకం గుర్తొచ్చింది. చలమయ్యగారు ఆ పొట్లం తీసుకోలేదు. ఏదో పమన్న వాడిలా నడుచుకుంటూ వెళ్ళి, సోమయాజులు గారింటికి చేరుకున్నాడు.

సోమయాజులుగారు అప్పటికే పూర్తించి వచ్చి గంటయిందట. అతడి ముఖంలో ఏదో ఆవేదన ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

"రాజ్యానికి బాగా వుందటోయ్" అంటూ కంగారుగా ప్రశ్నించారు.

# గెలవండి తెలుపు యుద్ధం

# బోనస్ బార్ సిద్ధం

బోనస్ శక్తిని పరీక్షించి చూడండి.
కొత్త బోనస్ డిటర్జెంట్ బార్. సాటిలేని పొదుపు—
గుర్తింపు గల మరే డిటర్జెంట్ బార్‌తోనైనాసరే దీని
పనితనాన్ని, వెలని పోల్చిచూడండి.
పసుపు, ఆకుపచ్చ రంగుల్లో దొరుకుతుంది
కొత్త బోనస్ డిటర్జెంట్ బార్

కొత్త బోనస్ డిటర్జెంట్ బార్






టాటావారి తయారీ

CASTB.26.723 TL

# ప్రాప్తం

"దానికేమిట్రా! నిక్షేపంలా వుంది. కాని మన ఖర్మ వుంది చూశావ్...?" ఆవేశం తోను, బాధతోను కలిపి చెప్తున్నాడు సోమ యాజులుగారు.

"అదేమిటి? ఏమయ్యిందేమిటి?" ఆతృతగా అడిగారు చలమయ్యగారు.

సోమయాజులు చెప్పలేకపోతున్నాడు. గొంతులోంచి మాట రావటంలేదు.

"అది కాదన్నయ్యా! పెద్దల్లుడు రాజ్యానికని, ముత్యాల దుద్దులు చేయించమని, రెండు నవరత్న బంగారం ఆయనగారి చేతికిచ్చారట. దాన్ని వీరెక్కడో పోగొట్టు కున్నారు. ఇందాక బస్టాండు నుండి మనింటి దాక, ఇంటి నుండి బస్టాండుదాక రోడ్డంతా వెతికొచ్చారు దొరకలేదు. ఇంత అజాగ్రత్త యితే ఎలా?" అంటూ సంగతి చెప్తూనే సోమయాజులుగార్ని కూడ కొద్దిగా దెప్పి పొడిచింది విశాలక్ష్మగారు. ఆమె కళ్లల్లో నీళ్లు సుడులు తిరుగుతున్నాయి.

"ఎల్లమ్మ వీధిలోనే వచ్చావుటోయ్?"

"అవును!"

"ఎర్రటి వులిపిరి కాయితంలో..."

"అవును... ఆ పొట్లం నీ వెక్కడ చూశావ్?" సోమయాజులుగారు బాధ కలిపిన కుతూహలంతో అడిగారు.

చలమయ్యగారేమీ మాట్లాడలేదు. వీధి లోకి పరిగెత్తినట్లు నడిచాడు. వెంట సోమ యాజులుగారు కూడాను. 'లైట్లు' కూడ పడ్డాయి.

అదే స్థలం. ఇందాక అక్కడ రాళ్ళల్లో పడివున్న ఎర్రటి వులిపిరికాగితపు పొట్లం, బంగారపు పొట్లం, అక్కడ లేదు.

చలమయ్యగారు, సోమయాజులుగారు ఇంకా వెతుకుతూనే వున్నారు.

టార్చిలైట్లు, పెట్రోమాక్సు లైట్లు, హరికేన్ లాంతర్లు. ఒక్కటే వెలుగు.

పదిమంది దాకా ఎల్లమ్మ వీధంతా తూర్పారపడుతున్నారు. లాభంలేక పోయింది.

అయినా చలమయ్యగారిలో ఏదో మొండి నమ్మకము. ప్రతి అడుగులోను అనుమానం. దొరకుతుందనే ఆశ. వ్యర్థమైపోయింది.

ఆ ప్రొద్దుట జరిగిన గోల్డు పొట్లం సంగతి సోమయాజులుగారికి చెప్పలేకపోయారు చలమయ్యగారు, ఈనాటికి కూడాను.




# ఫాలాక్షుని డైరీ

## ఆరోగ్య రహస్యం!

ఎంయురాడేవిస్ అనే ఆవిడకు ఇప్పుడు 82 ఏళ్లట. ఇన్నాళ్ళూ మీరు ఇంత ఆరోగ్యంగా ఎలా ఉండగలుగుతున్నారు? ఏమా రహస్యం అనడిగితే, తాను 1924లో డ్రిల్లు టీచరుగా చేరిననాటి నుంచీ నేటివరకూ నిత్య వ్యాయామాన్ని తాను ఏనాడూ విడనాడలేదన్నదట. ఆవిడిప్పుడు కీప్‌ఫిట్ అనే పేరుతో ఇంగ్లాండులో చెడ్‌పోర్డ్‌షైర్‌లో ఓ వ్యాయామ కళాశాల నడుపుతోందట. అందులో అందరూ యాభయ్యి ఏళ్లు పైబడ్డవాళ్లనే చేర్చుకుంటుందటావిడ— అహా చిరంజీవి!

**ముగ్గురు పిల్లలతో ముసలి దంపతుల ఆత్మహత్య!**

కోయంబత్తూరుకు చెందిన సిదుమాడ్లైకి చెందిన 70 ఏళ్లాయన కుటుంబ భారాన్ని భరించలేక, తన 60 ఏళ్ల భార్యను, 28, 24, 20 ఏళ్ల ముగ్గురు పిల్లలను తీసుకుని అళియారుఅనే ఏరువద్దకు వెళ్లిఅంతా కలసి ఆ ఏట్లో దూకి చనిపోయారట. అంత జీవితాన్ని భరించి ఆ 70 ఏళ్ల వృద్ధుడు ఇంత కఠోర నిర్ణయం ఎలాతీసుకున్నాడో దీనికి అంత వయసొచ్చిన ముగ్గురు పిల్లలు ఎలాగ ఒప్పుకున్నారో పోలీసులు విచారిస్తున్నారట.

**బాలానాం రోదనం బలం!**

పిల్లలు ఏడ్చి, ఏడ్వటంతోనే టక్కున ఆ పిల్లల్ని ఎత్తుకుని ఏమార్చి, ఏడుపునాపేసే ప్రయత్నాలు పెద్దవారు చేస్తూంటారనీ, అలాటి ప్రయత్నాల వల్ల పిల్లలకు మేలుకన్నా, కీడు ఎక్కువనీ, చిన్నపిల్లలు ఏడవటం వారి శరీరానికి, రక్త ప్రసరణ మండలానికి చాలా మంచిదనీ, కనుక వారిని కనీసం కాస్సేపైనా ఏడవనివ్వడం మంచిదనీ ఆస్ట్రేలియా శాస్త్రజ్ఞులు విజ్ఞప్తి చేశారట. భారద్దేశం ఎప్పుడో అనలేదూ—బాలానాం రోదనం బలం అని!

## 'ప్రజల మంచికే!'

ఇండోరు ప్రభుత్వ క్యాబినెట్ మంత్రివర్గంలోని సురేష్‌సేత్ మీద కొన్ని కేసులు ఉండి ఉన్నాయట. 1969—70 సంవత్సరాలలో ఆయన ఇండోర్ మేయరుగా ఉన్నప్పుడు రోడ్డు రోలర్లకు చక్రాలు ఓ పన్నెండు కొన్నారట. వీటికిగాను ఒక లక్షా ముప్ఫయ్యివేలరూపాయలు ఖర్చు పెట్టినట్టూ, ఫలానా కంపెనీకి ఈ డబ్బు ఇచ్చినట్టూ ఉన్నదట. విచారణలో ఆ చక్రాల ఖరీదు ఇరవై నాలుగు వేలు దాటదనీ, ఆ లక్షా ముప్ఫయ్యి వేల రూపాయల చెక్కు పుచ్చుకున్న కంపెనీ లేనేలేదనీ, అది బోగస్ [!] కంపెనీ అని తేలిందట. ఈ విషయం కోర్టు విచారణ వరకూ వెళ్లి, 6వ తేదీ జరుగుతున్న విచారణలో ఈ కేసును ఎడిషనల్ సెషన్స్ జడ్జి కొట్టివేస్తూ ప్రజల మంచికే ఈ కేసు విచారించడమంత మంచిదికాదని రాష్ట్ర ప్రభుత్వం అభిప్రాయపడుతోంది అన్నాడట. అనక జూన్ 13వ తేదీన ఆయన మంత్రిగా ప్రమాణస్వీకారం చేశారట.

**ఆఫీసులో బంధీ అయిన అబల!**

కేరళ రాజ్యానికి చెందిన ఎర్నాకుళంలో ప్రభుత్వ ఆఫీసుల భవనం ఒకటుందట. అందులో ఓ అంతస్తులో పనిచేస్తున్న మూసమ్మ అనే ఆవిడ పనే దైవము—పనియే దైవము అనుకుంటూ పనిపూర్తయ్యాకనే ఇంటికి పోదామనుకుని సాయంత్రం ఆఫీసు టయిమయ్యాకో పావు గంట ఎక్కువ పనిచేసి, ఈ పూటకు చాలని హ్యాండు బ్యాగు తీసికొని బయటికొద్దామని తలిచి, కొయ్యబారిపోయిందట. ఆమె ఏకాగ్రతను భంగపరచలేని మిగతా పనివారంతా వెళ్లిపోతూ పోతూ ఆఫీసు తాళం వేసుకు చక్కాపోయారట. దాంతో ఆవిడ టూరెత్తి నానా గోలా చేస్తే అంజనవారూ, కావివాళూ చూసి, పోలీసులు జోక్యం కల్పగజేసుకుని తాళం పగలేసి రాత్రిఎనిమిదిన్నరకావిడకు విడుదల ప్రసాదించారట.

## ఖుర్బానీ ఘనత!

హిందీ సినిమా ఖుర్బానీ ఇంతవరకూ మనదేశ సినిమా చరిత్రలో లేనంత రికార్డు స్థాపించిందట. హిందూ దేశంలో ఏ సినిమా వసూలు చేయనేలేనంత డబ్బు ఈ సినిమా వసూలుచేసిందట. దక్షిణ దేశంలో విడుదల చేసిన 44 ప్రింట్ల వల్ల మొదటి వారములో 22,73,086 రూపాయలు వసూల చేసిందిట. బెంగాలులో విడుదల చేసిన 21 ప్రింట్ల వల్ల మొదటి వారంలోనే 5,49,593 రూపాయలు, అంతా అల్లరులతో నిండిపోయినా అహమ్మదాబాదులో పది ప్రింట్ల వల్ల మొదటి వారంలో 5,25,708 రూపాయలూ వసూలు చేసిందిట.

**మేధావి లక్షణం!**

కళ్లజోడు పెట్టుకోని వారికన్నా, కళ్లజోడు పెట్టుకున్నవారు తెలివి తేటలు ఎక్కువ కలవారనీ, చూపు దోషం లేనివారికి మెదడు అంత తెలివి కలిగి ఉండదనీ పశ్చిమజర్మనీ, బ్రిటన్, అమెరికా దేశాలలో జరిపిన ఓ పరిశోధన వెల్లడించిందట. మేధావులందరూ చాలా చిన్నవయస్సు నుంచే కళ్లజోడు పెట్టుకున్నవారేననీ, కళ్లజోడు లేని మేధావి లేనేలేడనీ యీ పరిశోధన నిరూపించిందట.

**షా ఆస్తి!**

ఇటీవల మరణించిన షా రాజుగారి ఆస్తులు లెక్కలుచూస్తే వెయ్యి కోట్లనవున్ను దాటిందట. చిరాస్తులు, చరాస్తులు లెక్క యింత మొత్తం ఉంటుందని ఎవరూ కనీసం వూహించనైనా వూహించలేదట. రాజుగారు కదా మరి!

**పాలకన్నా పేడే లాభం!**

భారతదేశపు ఆవులు యిచ్చే పాలకన్నా అవి వేసే పేడే చాలా ఎక్కువనీ ఆ పేడను అమ్మితే పాలను అమ్మినకన్నా ఎక్కువ ధనం వస్తుందనీ హాలండ్‌కు చెందిన విజ్ఞానులు పరిశోధనానంతరం ప్రకటించారట.

# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

### శాంతినికేతన్ సభకు తెలుగు బృందం :

నవంబర్ 1, 2, 3 తేదీలలో శాంతి నికేతన్‌లో జరిగిన ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ 30వ సమావేశానికి ఈసారి వచ్చినంత మందితెలుగు ప్రతినిధులు ఇదివరకెన్నడూ రాలేదు. పొందిన విజయం ఇదివరకెన్నడూ పొందలేదు. దాదాపు 80 మంది తెలుగు ప్రతినిధులు తెనుగునాడు నాలుగంచుల నుంచి వచ్చిపాల్గొన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖ అధ్యక్షులు డాక్టర్ ప్రమోద్‌గణేశ్ లాల్యే ఓరియంటల్ కాన్ఫరెన్స్ కార్యవర్గ సభ్యులుగా ఎన్నికకాగా, 1982లో జయపూర్‌లో జరుగబోయే 31వ సమావేశంలో ప్రాచీన సంస్కృత సాహిత్య విభాగం అధ్యక్షులుగా ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖ ప్రొఫెసర్ డాక్టర్ బొమ్మకంటి రామలింగశాస్త్రి ఎన్నికయ్యారు. ఆల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ పుట్టిన 60 సంవత్సరాలలో ఇదివరకెన్నడూ ఇలాటి గౌరవం జరుగలేదు. అంతేకాక ఈ మహాసభ ద్రావిడ సాహిత్య విభాగానికి ఈసారి అనంతపురం స్నాతకోత్తరణ కేంద్రం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ కోరాడ మహాదేవశాస్త్రి అధ్యక్షత వహించడమూ తెలుగు వారికి గర్వకారణం. ఇదివరకు ఈ పదవి ఆంధ్రేతరులకే దక్కేది. పండిత పరిషత్తులో శాస్త్రరత్నాకర బిరుదాంకితులు శ్రీ రేమిళ్లసూర్యప్రకాశశాస్త్రి స్మృతిషు స్వత్వ నిరూపణం [స్మృతులలో ఆస్తుల నిర్ణయం] అనే విషయమై చేసిన ప్రసంగం చాల మన్ననలు పొందింది. ఆయా ప్రాంతాల నుంచి వచ్చిన తెలుగు విద్వద్వరేణ్యులను పేర్కొనడం సముచిత మనుకొంటాను. హైదరాబాద్ : శ్రీయుతులు బొమ్మకంటి రామలింగశాస్త్రి, ప్రమోద్‌గణేశ్ లాల్యే, సింధుతాయిలాల్యే, తిరుమల రామచంద్ర, తిరుమల అనంతలక్ష్మి, ముదిగొండ గోపాల్‌రెడ్డి, ముదిగొండ సుజాతారెడ్డి, శ్రీరామశర్మ, నిష్ఠల వెంకటరామ, శశిరేఖ, సుశీల, కె. శారద, కె. భారతి, రవ్వ శ్రీహరి, కె. గోపాలకృష్ణరావు, ధర్మపురి నరసింహాచార్యులు, ప్రేమలతా శ్రీవాస్తవ, రామాచారి ఘనపాఠి, హేమలతా వైసేకర్, ప్రజ్ఞా బెల్సరే, రజనీ బిలోలీకర్, డి. వి. ఎన్. శర్మ. ఆంధ్ర విశ్వవిద్యాలయం: పి. శ్రీరామమూర్తి, కె. కృష్ణమాచార్యులు, వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి, జి. పార్థసారధి, శరద్‌బాబు, మోరుగంటి శ్రీరామలాల్ శర్మ. కాకతీయ విశ్వవిద్యాలయం : రాజేశ్వరశర్మ, కోవెల సుప్రసన్నాచార్యులు, హరనాద్, వెంకటనారాయణ, నాగార్జున విశ్వవిద్యాలయం : పున్నారావు, రామబ్రహ్మం, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం : ఇ. ఆర్. కృష్ణశర్మ, ఎం. శ్రీమన్నారాయణమూర్తి, వి. ఆంజనేయశర్మ, ఎన్.బి. రఘునాధాచార్యులు, కాశీభట్ట సీతారామేశ్వరదత్త, ఐ. వేంకటేశ్వరరావు, రాఘవాచార్యులు, అరళికట్టి, కె. ప్రతాప్, డబ్ల్యు. ప్రహ్లాదనాయుడు. అనంతపురం పి. జి. సెంటర్ కోరాడ మహాదేవశాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రి బందరు: తట్టా నరసింహాచార్యులు, తట్టా వరదాచార్యులు, తట్టా ఆండాళమ్మ, గురిమెళ్ల వెంకట రంగరామానుజాచార్యులు నిజామాబాద్ : ఎం. వీరేశలింగం, ఈశ్వర్ చరన్, జిల్లెళ్లమూడి : పన్నాల రాధకృష్ణశర్మ, లక్ష్మీనిరంజనశర్మ, సన్నిధానం సుదర్శనశర్మ [ఆగిరిపల్లి], ఆర్. పద్మనాభరావు [ఎఐఆర్ కడప], ఇంద్రకంటి శ్రీకాంతశర్మ [ఎఐఆర్ విజయవాడ]. విజయనగరం: టి. జి. కృష్ణారావు, అప్పల నరసింహమూర్తి, పి. లక్ష్మీనరావు, వి. ఎల్. ఎస్. ఆచార్యులు, మద్రాసు విశ్వవిద్యాలయం: గంధం అప్పారావు, సుబ్బరెడ్డియార్, వి. రంగస్వామి రెడ్డియార్, బెంగుళూరు : చెన్నాప్రగడ తిరుపతిరావు, రత్నాకరం శంకరనారాయణరాజు, జి. ఎస్. మోహన్, మధురై విశ్వవిద్యాలయం: తిమ్మావజ్ఝల కోదండరామయ్య. విజయవాడ : రేమెళ్ల సూర్యప్రకాశశాస్త్రి, ఆర్. ఆర్. సోమయాజులు, వెంకట కుటుంబశాస్త్రి, దివి శ్రీధరబాబు, గోపరాజు రామ [గంగానాధఝా సంస్థ, అలహాబాద్], మోగేటి పరీక్షిత్ శర్మ [మహారాష్ట్ర], శాంతినికేతన్ : ఎ. రామమూర్తి, కె. ఎం. వర్మ, రామమోహన్‌రావు, వి. లక్ష్మీనారాయణ, శ్రీ పున్నారావు తమ పరిశోధన పత్రంలో ఆంధ్రశబ్ద చింతామణి త్రివిక్రముని ప్రాకృత వ్యాకరణాన్ని అనుసరించినట్లున్నది గనుక, త్రివిక్రముడు 13వ శతాబ్దివాడు గనుక, ఆంధ్ర శబ్దచింతామణి నన్నయాకృతం కాదని నిరూపించారు. ఇది కొత్త అంశం. ఈ మహాసభను విశ్వభారతి చాన్సలర్ ఆచార్య ఉమాశంకర్ జోషి ప్రారంభించారు. పశ్చిమ బెంగాల్ గవర్నర్ శ్రీ టి. ఎన్. సింగ్ ప్రధాన ప్రసంగం చేశారు. శ్రీ నీహార రంజన్ రాయ్ అధ్యక్షోపన్యాసం చేశారు. ఆచార్య ఉమాశంకర్ జోషి తమ ప్రసంగంలో విశ్వభారతి ప్రాచ్య ప్రతీచ్య సంకల్పాలను సమీక్షించి ప్రేమ సత్యాదృష్టితో ప్రపంచ సామరస్యానికి కృషి చేయుగాక అన్నారు.

> ప్రాచ్య ప్రతీచ్య సంకల్పాన్
> సంవీక్ష్య సత్యవత్సలా,
> లోకస్య సామరస్యార్థం
> రాజతాం విశ్వభారతీ.

### ముఖ్యమంత్రి సంకల్పం :

పరిపాలన యంత్రాంగాన్ని అవినీతి రహితంగా చేసి, ప్రజావిశ్వాసం చూరగొనేట్లు చేయడం తన ప్రభుత్వ లక్ష్యమని ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య నవంబర్ 6వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్టిలో అన్నారు. ఈ లక్ష్యం నెరవేరడానికి ప్రజలు సహకరించాలని ఆయన అన్నారు. లంచగొండితనం నిర్మూలించడానికి సలహాలిచ్చే సంఘంలో కొందరు పత్రికా రచయిత

ను కూడా సభ్యులుగా నియమించ దలచామని ముఖ్యమంత్రి తెలిపారు. బాధితులు పత్రికా రచయితలతో స్వేచ్ఛగా మాట్లాడాలని, అవినీతి నిర్మూలన సలహా సంఘంలో పత్రికా రచయితలను అందువలననే చేర్చదలచామని ముఖ్యమంత్రి అన్నారు.

**ఉపశ్రుతి :**

శాంతి నికేతనంలో జరిగిన ప్రాచ్య విద్వన్మహా సభలో ప్రధాన ప్రసంగం చేసిన పశ్చిమ బెంగాల్ గవర్నర్ శ్రీ టి. ఎన్. సింగ్ బిళ్లగోచీ పంచకట్టుతో వస్తే, తెలుగు దేశంనుంచి వచ్చిన పండితులు సూటు బూటు స్టైలతో రావడం విడ్డూరంగాలేదూ ? అన్నాను ఒక శ్రోతతో. మమ్మల్నీ గవర్నర్లుగా చేయించండి పంచకట్టుతో నిరాడంబరత చూపుతాము అన్నారు ఒక ప్రతినిధి శ్రీ రవ్వా శ్రీహరి.




ఎనిమిది గంటలకు 'ఎక్స్‌ట్రా' క్లాసు తీసుకుంటానని చెప్పాను స్టూడెంట్స్‌కి. కాని నిద్ర లేచే సరికే గడియారం ఏడుపదిహేను చూపిస్తున్నది.

ఈ కాలంలో విద్యార్థులు ఎంత ఆలస్యంగా వచ్చినా టీచర్స్ ఏమీ అనకూడదు. కాని లెక్చరర్ ఐదునిమిషాలు ఆలస్యంగా వచ్చాడా... ప్రిన్సిపాల్‌కి ఫిర్యాదు. డౌన్ డౌన్ స్లోగన్స్... ఆ భయంతో కాలకృత్యాలు అయ్యాయనిపించి హడావుడిగా బయలుదేరుతుంటే, "వెండి పళ్లెం, గ్లాసులు, పన్నీరుబుడ్డి .." కనిపించటం లేదంటూ ఏడ్చింది అమ్మ.

ఆవిడ జ్ఞాపకశక్తిమీద నాకట్టే నమ్మకం లేకపోవటంతో "ఎక్కడ పెట్టావో సరిగా చూసుకో" అన్నాను షూ వేసుకుంటూ.

"అన్నిచోట్లా చూశాన్రా" అంది.

"మరోసారి వెతుక్కోవే" అని సలహా ఇచ్చి సైకిల్ తీసుకుని కాలేజీకి వెళ్ళిపోయాను.

కాలేజీలో నాలుగ్గంటలు వాగి ఇంటికొస్తుంటే గుమ్మంలోనే ఎదురయ్యాడు మామయ్యని పిలవబడే పక్కింటి విశ్వనాథం గారు—

"ఏమయ్యా వాసూ! ఇదేమన్నాబాగుందా" అంటూ.

ఏం బాగుండటమో ఏంబాగలేకపోవటమో నా కర్థం కాలేదు.

"ఇంట్లో దొంగలుపడి అంత ఖరీదైన వస్తువులు పోయినా చీమకుట్టినట్టైనా లేకపోతే ఎలాగయ్యా ... నువ్విలా ముంగిలా కూర్చుంటే అదే అలుసుగా తీసుకుని ఆ దొంగాడే రేపోమాపో మిగిలిన వస్తువులకోసం రాకుండా ఊరుకుంటాడా ? అయినా ఇవేళ నీ ఇంట్లో జరిగింది రేపు మా యింట్లో అవుతుంది. పోలీసు రిపోర్టు ఇచ్చి మన జాగ్రత్తలో మనం ఉండాలి కాని..." ఇంకా ఏదో అంటున్నాడు. కాని నేను వినిపించుకోవటం లేదు. నా దృష్టంతా వంట ఇంటిమీదుంది, అమ్మ తెచ్చే కాఫీ కోసం. "నే వెళ్ళి ఇనస్పెక్టరికి చెప్పొచ్చా. మరో అరగంటలో పోలీసుల్ని పంపిస్తా నన్నాడు. నువ్వెక్కడికి వెళ్ళక వాళ్ళతో మాట్లాడు." "అలాగే" అన్నాను కాఫీ అందలేదనే విరాకుతో.

విశ్వనాథంగారు చెప్పినట్టే మరో పది నిమిషాల్లో వచ్చారు ఇద్దరు కానిస్టేబుల్స్. వస్తూనే "ఏ ఏ వస్తువులు పొయ్యాయి! ఎక్కడ పెడితే పొయ్యాయి? చివరి సారిగా ఎవరు, ఎప్పుడు చూశారు ? ఇంట్లో మనుషులెంతమంది? పని మనుషులు ఉన్నారా? మీ కెవరిమీదైనా అనుమానం ఉందా?"— ఇలాంటివే ముప్ఫయి ప్రశ్నలు వేసారు? వంట ఇంట్లోకి బూటు కాళ్లతో వచ్చినందుకు పోలీసుల్ని మనసులో తిట్టుకుంటూనే సమాధానాలిస్తున్నది అమ్మ

అరగంట ప్రశ్నల వర్షం తరువాత అమ్మ ఇచ్చిన ఫిల్టరు కాఫీ తాగి, 'ఎలాగైనా మీవస్తువులు మీకందిస్తాం'అని అభయహస్తం ఇచ్చి వెళ్ళారు. ఆ పోలీసుల ధీమాచూస్తుంటే ఆ దొంగాడు వీళ్ళ స్నేహితుడేమో ననిపించింది.

పోలీసులు వెళ్లిన తరువాత అమ్మ, మామయ్య కూర్చుని ఈ దొంగతనాన్ని మా వీధి చివర్లో ఉండే రిక్షా రంగడే చేసుంటాడనే నిర్ణయానికి రావడం బాధ కలిగించింది.

రంగడు నాకు గత ఆరేళ్ళుగా తెలుసు. ప్రభుత్వం వారిచ్చిన రిక్షా నడుపుకుంటూ

బ్రతికినంతలో చాలామందికన్నా నిజాయితీగానే బ్రతుకుతున్నాడు. అందేత రంగడి మీద దొంగతనం రుద్దటం నాకు నచ్చలేదు. ఆ మాటే వాళ్లతో అంటే 'నీకేం తెలుసు కుర్రాడివి' అన్నట్టు చూశారు.

కాని నా నమ్మకాన్ని వమ్ము చేస్తూ రంగడింట్లోనే వస్తువులు దొరికాయంటూ వచ్చాడు కానిస్టేబుల్. రంగడి చేతికి తాడు కట్టి తీసుక వచ్చాడు. వాడు కళ్లల్లో ప్రాణం పెట్టుకుని ఉన్నాడు.

"అయ్యగారి కాళ్లమీద పడి చేసిన తప్పు ఒప్పుకోరా లం..." అంటూ లాఠీ ఎత్తి ఒక్కటివ్వబోయాడు పోలీసు.

"తప్పయిపోయింది బాబయ్యా..." అంటూ కాళ్ళమీద పడ్డాడు.

అప్పుడు చూశాను వాడి వంటిమీద తేలిన బొందుల్ని, ఊహించాను వాటి వెనుక వాడు తిన్న లాఠీ దెబ్బల్ని.

ఆ లాఠీ దెబ్బలు గురించి తెలిసిన వివడైనా, రంగడే కాదు కింకాంగ్ ఐనా సరే చచ్చినట్టు ఒప్పుకుంటాడు చెయ్యని నేరాన్నైనా.

కోర్టువారు రంగడికి రెండునెలలు శిక్ష వెయ్యటం, మా వస్తువులు తీసుకవెళ్లటం జరిగింది.

అమ్మకు తోడుగా నేను వెళ్లాను పోలీసు స్టేషన్‌కి. కుర్చీకి నిండుగా కూర్చుని జోగుతున్నాడు ఇనస్పెక్టర్. మా అలికిడికి నిద్రాభంగం కలిగినట్టుంది, "ఏమిటని" చిరాకుగా అడిగాడు.

విషయం తెలిసి "వీళ్ళనా గదిలోకి తీసుకెళ్లరా" అని అర్డరేసాడు ఓ కానిస్టేబుల్‌కి.

ఆ గదిలో వెండివి, స్టీలువి, ఇత్తడివి, పాతవి, కొత్తవి, పనికొచ్చేవి, పనికిరానివి చాలా సామాన్లున్నాయి. ఇవికాక విరిగిపోయిన సైకిల్, పాడయిపోయిన కుట్టు మిషన్ వగైరా వగైరా ఉన్నాయి.

"మీ వస్తువులేవో గుర్తుపట్టండి" అన్నాడు కానిస్టేబుల్ ఇనస్పెక్టర్ కన్నా నిర్లక్ష్యంగా.

గత నలభై ఏళ్ళుగా ఆ వస్తువులతో ఉన్న పరిచయంతో అంత దొంతరలోంచి ఇట్టే పట్టేసింది అమ్మ. అవన్నీ ఎస్. ఐ. టేబుల్ మీదికి చేర్చాడు కానిస్టేబుల్.

వాటిని పరిశీలనగా చూసి వెండిపళ్ళెం, రెండు గ్లాసులు ముందుకు నెట్టి "ఊ

## ధర్మం చెర

తీసుకవెళ్ళండి'' అని ఉరిమాడు ఇనస్పెక్టరు

"మరి ఆ కుంకుమ భరిణ, పన్నీర బుడ్డి, కారియర్...సంగతి'' అని అమ్మ అంటుండగానే "వాటిమీద మీ పేర్లు లేవ కాబట్టి అవి మీవోకాదోమాకెలా తెలుస్తుంది. అందుచేత ఇవ్వటానికి రూల్సు వప్పుకోవు' అన్నాడు. 'అదేమిటి' అని అడిగితే "మీ ఇష్టమైతే ఇచ్చిన వాటిని తీసుక వెళ్ళండి. లేకుంటే లేదు'' అంటూ కుర్చీని వెనక్కు తోసి తను మరో గదిలోకి వెళ్ళిపోయాడు.

ఇనస్పెక్టర్ ముఖం చూస్తే నాకు భయం వేసింది. మరి కొంచెం సేపుంటే ఇచ్చిన వస్తువులు లాక్కోటమే కాకుండా ఏదో ఒక కేసులో ఇరికిస్తాడేమో ననిపించి — అమ్మ చెయ్యి పట్టుకుని బయటకు లాక్కొచ్చి నంత పని చేసాను.

పదడుగులు వేసానో లేదో ఇంతకు ముందు మాకు వస్తువులు చూపించిన కానిస్టేబుల్ చాటునుంచి వచ్చి "అయ్యగారికి ఓ ఏభై ఇచ్చుకోండి, మీ వస్తువులు మీ కొస్తాయి'' అని వెకిలి నవ్వు ఒకటి నవ్వాడు.

బుద్ధిగా క్లాసులో పాఠాలు చెప్పుకునే నాకు పది నిమిషాల క్రితం ఒప్పుకోని రూల్సు ఇప్పుడెలా ఒప్పుకుంటాయో అర్థం కాలేదు.

"మరో వందిచ్చుకుందాం కాని ఆ గదిలో ఉన్న మరో పెద్ద వెండి పళ్ళెం కూడా ఇస్తారేమో కనుక్కో'' అంటోంది అమ్మ.

ఇంకా అక్కడే ఉంటే ఎలాంటి మాటలు వినాల్సి వస్తుందోనని అమ్మని లాక్కొచ్చి రిక్షాలో పడేసి, త్వరగా పోనిమ్మన్నాను.

కొంచెం దూరం వచ్చిన తరువాత, నా గుండెదడ తగ్గిందనే నిర్ధారణకు వచ్చి ధైర్యంగా వెనక్కి తిరిగి చూస్తే, పోలీసు స్టేషన్ మీదున్న అశోకుని స్తంభంలోని మూడు సింహాలు వికృతంగా గర్జిస్తున్నట్టు, క్రింద రాసిన "సత్యమేవ జయతే'' తాచు పాములాబుసకొడుతున్నట్టు అనిపించింది.

---

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.

---




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# ఆకులు ఎందుకు రాలిపోతాయి..?



అయిదేళ్ళ వయసులో 'అమ్మా! ఆకులు ఎందుకు రాలిపోతాయి?' అని ప్రశ్నించిందా అమ్మాయి...ఎనిమిదేళ్ళ వయసులో క్రీస్తును తలుచుకుని, 'అయ్యో! అంత బరువైన శిలువను అంత దూరం ఎలా మోయగలిగాడో గదా' అని కన్నీరు కార్చిందా అమ్మాయి... పదేళ్ళ వయసులో 'గులాబీ మొగ్గ అంత అందంగా ఎలా వికసిస్తుందో గదా' అని ఆశ్చర్యపోయిందా అమ్మాయి.

ఆ అమ్మాయే ఇరవై రెండేళ్ళ వయసులో ఆకస్మికంగా వికసించి అంతలోనే వాడి వడిలిపోయింది ... ముప్పయ్యేళ్ళ వయసులో ఆశలన్నీ ఆరి ఆకులా రాలిపోవటానికి సిద్ధమయిందామె... 'నేసు మోస్తున్న శిలువ క్రీస్తు మోసిన దానికన్నా బరువుగా ఉన్నట్లుంది' అని వాపోయిందామె...ఎవరామె...? అన్నీ ఉండి కూడా మూడు పదుల వయసులోనే పండుటాకులా ఎలా రాలిపోసాగింది ...?

విశ్వకథా విపంచి 'విపుల' డిశంబర్ సంచికలో మైథిలీ భాషా కథ "అంజలి" చదవండి. మిమ్మల్ని ఆకట్టుకునే ఆణిముత్యాల్లాంటి ఈ నెల 'విపుల'లోని అనేక కథలలో ఒకటి ఈ "అంజలి".

కథలుగాక మరెన్నో కార్టూన్లు, జోకులు, విచిత్ర విశ్వ విజ్ఞానం అందజేస్తుంది 'విపుల'.





విశ్వ కథా విపంచి

# విపుల

132 పేజీలు: రెండురూపాయలే

# అన్నిటికన్న తెల్లని పెయింట్ కొనడం గొప్ప సంగతే మరి. ఏళ్ళతరబడి తెల్లగా నిలిచి వుండటమూ అంతే గొప్ప సంగతి మరి.

## రండి, నెరొలాక్ పెయింట్స్ నుంచి సలహాతో సరియైన తెలుపును ఎంచుకోండి.

మీరే గనక తెలుపు పెయింట్‌ను కొనాలనుకుంటే మీరు కావాలనుకేది యిది—అన్నిటికన్న తెలుపు, అన్నిటికన్న శుద్ధమైన తెలుపా లేక ఏళ్ళతరబడి నిలిచివుండే తెలుపా ?

నిజానికి చూస్తే, యివన్నీ ఒకేసారిగానే మరి.

అందుకే, కొనేముందు యీ విషయాన్ని గుర్తుంచుకోండేం—కొన్ని తెల్ల పెయింట్‌లు డబ్బాల్లో అయితే ఎక్కువ తెల్లగా అనిపిస్తాయి కాని అలా ఉండవవి. కొన్నిటిని వేసిన తర్వాత తెల్లగానే కనిపిస్తాయి గాని కొద్ది కాలంలోనే పారిపోయి పసుపురంగు వచ్చేస్తుంది. నిజానికి చూస్తే వాటిని ఒక్కసారైనా వాడి చూడకుండా వాటిలోంచి ఎంచుకోవడం అన్నది చాలా కష్టమైన విషయమే. నెరొలాక్ పెయింట్స్ యీ చిక్కుని విడదీసేస్తుంది తేలికగా.



**1 తెలుపుని పరీక్షించండి**

నెరొలాక్ పెయింట్స్ వారు తమ తెలుపు పెయింట్స్‌ని మిగతా వాటితో పోల్చి చూసుకుంటూ వివిధ వాతావరణ పరిస్థితులలో ఎప్పుడూ పరీక్షిస్తూనే ఉంటారు. ఇంతకీ తేలిందేమిటంటే, నెరొలాక్ పెయింట్లని యితర తెలుపులతో పోల్చిచూస్తే మిగతా తెలుపు పెయింట్లు తొందరగా పాలిపోయి పచ్చబడిపోతాయని. నిజానికి చూస్తే, నెరొలాక్ తెలుపుతో పోల్చి చూస్తే, మిగతావి అంత తెల్లగా ఉండనే ఉండవు. ఏ తెలుపైనా అంత ఎక్కువకాలం దాకా అంత తెల్లగా ఉండనే ఉండదు.

**2 ఉజ్వలమైన ఆ రంగు ఛాయలకోసం శుద్ధమైన తెలుపు**

చాలా సార్లు, మీకు నచ్చే ప్రత్యేకమైన పెయింట్స్ షేడ్ తీసుకురావడం కోసం పెయింటర్, తెలుపు పెయింట్‌కి పనికొచ్చే, వాడే 'స్టెయినర్' కలుపుతాడు. స్పష్టమయ్యేదేమిటంటే, చివరికి వచ్చే రంగు ఛాయ యొక్క శుద్ధత, అసలు తెలుపు యొక్క శుద్ధతపై ఆధారపడి వుంటుందని. అందుకే మీరు ధ్రువపరుచుకోవాలి, మీరు కొన్నది అన్నిటికన్న శుద్ధమైన తెలుపేనన్నది. నెరొలాక్ యొక్క తెలుపులో మీకు





అన్నిటికన్న ఎక్కువైన శుద్ధమైన, ఉజ్వలమైన రంగు ఛాయల్ని పొంద గలుగుతారు.

**3 తెలుపులోని శ్రేణి**

నెరొలాక్ పెయింట్స్ మీకు మూడు రకాల్లో, ఉత్తమమైన నాణ్యతతో, తెలుపులన్నిట్లో తెల్లని తెలుపుని యిస్తుంది.

మరి మీకు నచ్చే తెలుపుని పేరు పెట్టి అడిగి మరీ తీసుకోండి.

- నెరొలాక్ అల్ట్రా వైట్ సింథటిక్ ఎనామెల్
- నెరొలాక్ వండర్ వైట్ ఏక్రలిక్ ఎమల్షన్, సిలికొన్‌తో.
- నెరొలాక్ యొక్క సూపర్ వైట్ సోల్జర్ బ్రాండ్ అయిల్ బౌండ్ డిస్టెంపర్.



నెరొలాక్ పెయింట్స్ నుంచి సర్వోత్తమంగా లాభాన్ని పొందాలంటే, ఉచితంగా లభించే నెరొలాక్ పేయింట్స్ పుస్తకం **'All you wanted to know about painting'** ప్రతి కోసం రాయండి. ఈ క్రింద యివ్వబడిన కూపన్‌ను నింపి వెంటనే పోస్ట్‌లో పంపించండి.






# నెరొలాక్ పెయింట్స్

ఇంటా బయటా అందరూ మెచ్చేవి, మనసుకు నచ్చేవి.

దయయుంచి నాకు ఇంగ్లీషులోగల నెరొలాక్ పెయింట్స్ పుస్తకం ఒక ప్రతిని పంపించండి.

పేరు: ................................................

అడ్రసు: ................................................

................................ పిన్ కోడ్: ................

గుడ్‌లాస్ నెరొలాక్ పెయింట్స్ లి.,
మార్కెటింగ్ విభాగం, పి.ఒ. బాక్స్ నం. 16322
బొంబాయి 400 013.